Photo by Vidyavrata



బహుమతి
పొందిన వ్యాఖ్య

'నిజము వ్యాయామంబు...

పంపినవారు :
S. T. V. S. D. అయ్యంగార్





LUX
TOILET SOAP
LUX
LUX
TOILET SOAP

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక ఇంద్రజాలం, చిత్ర కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు - విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

సెలవులలోని విశేషములను తెచ్చుకోండి!



'కోడక్' ఫిల్ము నే వాడండి!

మధుర పరిమళము గల...

డ్రాలే

మస్క్ సోప్

టాల్క్ పౌడరు









లలితా రావు B. A.

# ఇప్పుడు

## కొత్తరకపు

# టాయిలెట్ పౌడరు

## ఎల్లవేళలందును హాయిగా నుంచుటకు

భారతదేశమందు ప్రప్రథమంగా, లోకప్రసిద్ధమైన **జి–11**※ తో గూడినట్టి అతిసున్నితమైన టాల్కమ్ పౌడరు తయారుచేయబడినది....జి–11 చర్మ మచ్చలను అత్యధిక చమటను గలిగించు క్రిములను నాశనమొనర్చునట్టి ఒక్కటే ధృవపడిన మంట బెట్టని రసాయనము. ఈ అద్భుతమైన పౌడరు చర్మము తడివల్ల రేగుట, వేడికి పేలుట ఈ బాధలనుండి శాశ్వతమైన శీఘ్రవిముక్తిని గలిగించును..... ఎల్లప్పుడూ, పనికి, ఆటలకు, షికారుకు, విందులకు వెళ్లేముందు ఈ శమనకరమైన, మనోహరమగు పరిమళము గల పౌడరును బాగా అద్దుకొనుడు....మీరు మిగుల నమ్మికగా నుందురు, చాలా ప్రీతికరముగా నుండుడు! బట్టలయందు జల్లబడేయడల, అది రాపిడిని నిరోధించును.

Godrej జి–11 తో గూడిన

రిజిస్టర్డ్

# గోద్రెజ్

# టాయిలెట్ పౌడరు




జి-**11** తో కూడిన
హెయిర్ టానిక్కు
షేవింగ్ స్టిక్కు
సింతాల్

※ వైజ్ఞానిక గ్రంథ జాబితాతో గూడిన **జి–11** గాథ (హెక్సాక్లోరోఫీన్) కొరకు, దిగువ చిరునామాకు వ్రాయుడు. గోద్రెజ్ సోప్స్ ప్రయివేట్ లిమిటెడ్, బొంబాయి – 11.

ఆంధ్రప్రదేశ్ అంతటా విజయవంతంగా నడుస్తోంది!






నటీనటులు:
ఎన్. టి. రామారావు
ఎ. నాగేశ్వరరావు
ఎస్. వి. రంగారావు
రేలంగి
సావిత్రి

నిర్మాతలు.... నాగిరెడ్డి & చక్రపాణి





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

సరిగా ఒక శతాబ్దం క్రితం ఈ దేశంలో ఒక ఉద్యమం నడిచింది. భారతీయ స్వాతంత్ర్యోద్యమాలకు అదే నాంది. ఆ ఉద్యమాన్ని "సిపాయీల తిరుగుబాటు" అన్నారు. కాని అది కేవలం సిపాయీలకు సంబంధించిన తిరుగుబాటు మాత్రమే కాదు, బ్రిటిషువారిని దేశంలోనుంచి వెళ్లగొట్టటానికి భారతీయులు సాగించిన సమరం. హింసాయుతమైన ఈ సమరాన్ని మరింత హింసతో బ్రిటిషుపాలకులు అణచివేయగలిగారు.

కాని, ఇది జరిగిన కొన్ని దశాబ్దాల అనంతరం, మన జాతిపిత అయిన మహాత్మాగాంధీ ఈ ఉద్యమాన్ని అహింసా సిద్ధాంతంపై, సత్యాగ్రహం సాధనంగా పెట్టుకుని, కొనసాగించాడు. ఈ అహింసా సమరం మానవ చరిత్రలో అపూర్వమైనది. అంతేగాక, ఈ సమరం ద్వారా దేశం ఐక్యత సాధించింది. అంతకు పూర్వం దేశమంతటా అంతఃకలహాలు చెలరేగుతూ ఉండిన కారణంచేతనే సామ్రాజ్యవాదులు దేశాన్ని సులువుగా లోబరుచుకోగలిగారు. సత్యాగ్రహ సమరం అనైక్యతను రూపుమాపి, స్వాతంత్ర్యానికి అవసరమైన ఐక్యతను సాధించింది. ఈ యేడు మనం 1857 నాటి స్వాతంత్ర్యోద్యమం తాలూకు శతాబ్ది జరుపుకుంటాం.

సంపుటి 20 మే 1957 సంచిక 5

# అట్టమీది బొమ్మ

ధర్మరాజూ, ద్రౌపదీ, భీముడూ మారువేషాలు ధరించి, మారుపేర్లతో విరాట రాజువద్దకు వెళ్లి ఉద్యోగాలు సంపాదించిన అనంతరం, అర్జునుడు బృహన్నల రూపంలో బయలుదేరి విరాటుడి కొలువుకు వెళ్లాడు. విరాటరాజు నివ్వెరపోయి, "నీ వెవరు?" అని అడిగాడు.

"మహారాజా, నేను బృహన్నల అనేదానను. నాట్యకళలో నాకు మంచి నైపుణ్యం ఉన్నది. పిల్లలకూ, పెద్దలకూకూడా నాట్యశిక్షణ చేయగలను. వీణా, మృదంగమూ మొదలైన వాద్యాలు వాయించటంలో ప్రవీణురాలను," అని అర్జునుడు జవాబు చెప్పాడు. విరాటరాజీ మాటలను నమ్మలేక, "నాయనా, నీవాలకం చూస్తే ధనుర్బాణాలు ధరించదగి ఉన్నావు. స్త్రీజనానికి నాట్యాలు నేర్పేగతి నీకేంపట్టింది? ధనుర్బాణాలు ధరించి నాకు అండగా ఉండు!" అంటూ ధనుర్బాణాలు తెప్పించి అర్జునుడి ఎదట పెట్టాడు.

అర్జునుడు వాటిని చూసి భయపడినవాడులాగా నటిస్తూ, "మహారాజా, వీటిని ఎలా పట్టుకోవాలోకూడా నాకు తెలియదు. నేను నిజంగా బృహన్నలను! నాపై అనుగ్రహించి నాట్యానికి నన్ను పెట్టుకోండి!" అని విన్నవించుకున్నాడు.

అప్పుడు విరాటుడు తన కుమార్తె అయిన ఉత్తరను పిలిపించి, "తల్లీ, ఈవిడ పేరు బృహన్నల. ఇకనుంచీ ఈమె నీకు నాట్యం నేర్పుతూ, నీకు చెలికత్తెగా ఉంటుంది!" అన్నాడు. అర్జునుడు రాజపుత్రిక వెంట అంతఃపురానికి వెళ్లిపోయి అక్కడ నర్తనశాలలో ఉత్తరకు దినదినము నృత్యం నేర్పసాగాడు.

తరువాత కొంతసేపటికి విరాటుడు కొలువు చాలించి అశ్వశాలకు వెళ్లాడు. ఆ సమయంలో నకులుడు అక్కడికి వచ్చి తానుకూడా గుర్రాలను చూడసాగాడు. విరాటుడు అతన్ని పిలిపించి, "నాయనా, నీకు గుర్రాలను గురించి తెలుసునా?" అని అడిగాడు. దానికి నకులుడు, "మహారాజా, నాకు అశ్వచికిత్సా, అడవిగుర్రాలను మచ్చిక చెయ్యటమూకూడా తెలుసు. దయ ఉంచి నన్ను ఉద్యోగంలో పెట్టుకోండి," అని అడిగాడు. రాజు సమ్మతించాడు.

ఆ రోజే సహదేవుడుకూడా విరాటరాజువద్ద గోపాలకుడుగా ఉద్యోగం సంపాదించుకున్నాడు. ఈ విధంగా పంచపాండవులూ, ద్రౌపదీ తమ అజ్ఞాతవాసదీక్ష అరంభించారు.



# లోకం తీరు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్త్వుడు కృష్ణద్వైపాయనుడనే ధనిక బ్రాహ్మణుడుగా కౌశాంబీ నగరంలో జన్మించాడు. ఆయన పెరిగి పెద్ద అయాక లౌకికవాంఛలవల్ల కలిగే అనర్థాలను గుర్తించినవాడై, ఆయన తనకు గల యావదాస్తినీ దానధర్మాల కింద ఖర్చు పెట్టేసి, సన్యాసం అవలంబించి యాభైఏళ్ల పాటు హిమాలయపర్వతాలలో తపస్సు చేసుకుంటూ గడిపాడు. కాని, ఆకులూ అలములూ తింటూ శరీరాన్ని అనేక బాధలకు గురిచేస్తూ సాగించిన ఈ తపస్సు ఆయనకు సిద్ధించలేదు.

అటుపైన కృష్ణద్వైపాయనుడు హిమాలయాలను వదిలి, తీర్థయాత్రలు చేస్తూ, కాలక్రమాన కాశీరాజ్యానికి వచ్చాడు. అక్కడ ఆయనకు బాల్యమిత్రు డొకాయన, మాండవ్యుడు అనేవాడు, ఒక గ్రామంలో కనిపించి ఆతిథ్యం ఇచ్చాడు. మాండవ్యుడు కృష్ణద్వైపాయనుణ్ణి తనవద్దనే ఉండమని కోరాడు; ఆయన నిమిత్తం చక్కని పర్ణకుటీరం ఒకటి కట్టించి, ఆయన అవసరాలన్నిటినీ తాను యథావిధిగా గడుపుతూ వచ్చాడు.

ఒకనాడు, మాండవ్యుడి కుమారుడు, యజ్ఞదత్తుడనేవాడు, బంతితో ఆడుతూ ఉండగా ఆ బంతి వెళ్లి ఒక పాము నివసిస్తున్న పుట్టలో పడింది.

ఈ సంగతి తెలియక యజ్ఞదత్తుడు బంతి తీసుకోవటానికై పుట్టలో చెయ్యి పెట్టాడు. వెంటనే వాడిచేతిని పాము కరిచింది. త్వరలోనే పాము విషం వంటికి ఎక్కి యజ్ఞదత్తుడు స్పృహలేకుండా పడిపోయాడు.

తమ కుమారుడు ఈ స్థితిలో పడి ఉండగా మాండవ్యుడు ఆయన భార్యా వాణ్ణి



చూశారు. మాండవ్యుడు వెంటనే తన కుమారుణ్ణి చేతుల్లో ఎత్తుకుని, భార్యతో సహావచ్చి, కుర్రవాణ్ణి కృష్ణద్వైపాయనుడి కాళ్లముందు పడేశాడు.

"బాబూ, మీ తపశ్శక్తిచేత వీణ్ణి బతికించి మాకు పుత్రభిక్ష పెట్టండి!" అని ఆ దంపతులు ప్రార్థేయపడ్డారు.

కృష్ణద్వైపాయనుడికి ఏమి చెయ్యాలో తోచలేదు. "మీరు పొరపడుతున్నారు. నా దగ్గిర ఏట్టి శక్తులూలేవు. నేను అంతకాలం తపస్సుచేశానేగాని ఆ తపస్సు సిద్ధించలేదు. కనీసం నాకు మందూమాకులూ అయినా తెలీవు. నేను మీ కేవిధంగా సాయం చెయ్యగలను? మీపిల్లవాణ్ణి ఎలా బతికించగలను?" అని ఆయన విచారపడుతూ, ఆ దంపతులతో అన్నాడు.

"తపస్సు సిద్ధించకపోయినా అంత కాలం చేసిన తపస్సుకు ఫలితం ఉండకపోదు. మీరు సత్యప్రమాణం చెయ్యండి, కుర్రవాడు తప్పక బతుకుతాడు!" అన్నాడు మాండవ్యుడు.

కృష్ణద్వైపాయనుడు ఇందుకు సమ్మతించి ఈ కింది శ్లోకం చదువుతూ సత్యప్రమాణం చేశాడు.



"సత్తాహం ఏవాహం ప్రసన్నచిత్తో
పుంజత్థికో అచరిం బ్రహ్మచరియం,
అధాపరం యం చరితం మమయిదం
వస్సాని పంఞ్ఞాస సమాధికాని
అకామకో వా హి అహం చరామి,
ఏతేన సచ్చేన సువత్థి హోతు,
హతం విసం, జీవతు యంఞ్ఞదత్తో"

[నేను పుణ్యంకోరినవాణ్ణి అయి వారం రోజులపాటు నిర్మలచిత్తంతో బ్రహ్మచర్యం అవలంబించాను. తరువాత నేను యాభై ఏళ్లపాటు చేసిన తపశ్చర్య చిత్తశుద్ధితో చేసినది కాదు. నేనుచేసే ఈ సత్యప్రమాణం ఫలితంగా మేలు కలిగి, విషం విరిగి, యజ్ఞదత్తుడు పూర్ణజీవుడౌగాక!]





"యస్మా దానం న అభినందిం కదాచి
దిరవానాహం అతిథిం వా సకాలే
న చాపి మే అప్పియం అవేదుం
బహుస్సుతా సమణా బ్రాహ్మణాచ
అకామకో వా హి అహం దదామి,
ఏతేన సచ్చేన సువత్థి హోతు,
హతం విసం, జీవతు యంఞదత్తో"

[నేను అతిథులను సత్కరించానుగాని, అది ఇష్టంతో కాదు. జ్ఞానులైన శ్రమణులూ, బ్రాహ్మణులూ నా ఆతిథ్యం ఇష్టంలేకుండా చేసినదేనని తెలుసుకోలేకపోయారు. నేను దానాలుకూడా ఇష్టంలేకుండానే చేశాను. నేను చేసే ఈ సత్యప్రమాణం ఫలితంగా మేలుకలిగి, విషం విరిగి, యజ్ఞదత్తుడు పూర్ణజీవుడౌగాక !]

మాండవ్యుడు ఈ విధంగా సత్య ప్రమాణం చెయ్యగానే యజ్ఞదత్తుడి వీపు నుంచి మరికొంత విషం బయటికి వచ్చి నేలలో ఇంకిపోయింది. కుర్రవాడు లేచి కూచోగలిగాడుగాని, నిలబడలేకపోయాడు. అప్పుడు మాండవ్యుడు తన భార్యకేసి తిరిగి ఇలా అన్నాడు.

"నీవుకూడా సత్యప్రమాణం చెయ్యరాదా? కుర్రవాడు లేచి ఎప్పటిలాగా తిరగగలుగుతాడు," అన్నాడు.

వెంటనే కుర్రవాడి వక్షస్థలంనుంచి కొంతవిషం బయటికి వచ్చి నేలలో ఇంకి పోయింది. వాడు కళ్లు తెరిచి తన తలి దండ్రులకేసి ఒకసారి చూసి, "అమ్మా!" అని మూలిగి, పక్కకు ఒత్తిగిలి తిరిగి మైకంలో పడిపోయాడు.

"చూశావు గదా? విషం పూర్తిగా లాగి వెయ్యటం నాకు సాధ్యం కాలేదు. నీవు కూడా సత్యప్రమాణంచేసి చూడు, ఫలితం ఉండవచ్చు," అని కృష్ణద్వైపాయనుడు మాండవ్యుడితో అన్నాడు.

మాండవ్యుడిందుకు ఒప్పుకుని ఈ విధంగా సత్యప్రమాణం చేశాడు.







"నేను ప్రకటించవలిసిన సత్యంకూడా ఉన్నదిగాని, దాన్ని మీముందు ప్రకటించ టానికి వీలులేదు," అన్నది మాండవ్యుడి భార్య విచారంగా.

"పిచ్చిదానా, ఎందుకు సందేహిస్తావు? మనకు కుర్రవాడికన్న ఎక్కువేమిటున్నది? సత్యప్రమాణం చెయ్యి," అని మాండ వ్యుడు తన భార్యను ప్రోత్సహించాడు. ఆమె అందుకు ఒప్పుకుని ఈ విధంగా సత్యప్రమాణం చేసింది.

"అసో విసో తాత పహూత తేజో
యే తం అదట్టి పతరా ఇదచ్చి,
తస్మిం చ మే అప్పియతాయ అజ్జ
పితరి చ తే నత్థి కోచి విసేసో,
ఏతేన సచ్చేన సువత్థి హోతు,
హతం విసం, జీవతు యంఞదత్తో"

[నాయనా, ఇవాళ నిన్ను ఆ పుట్టలో కాటువేసిన విషసర్పాన్నిచూస్తే నాకెంత అసహ్యమో, నీ తండ్రిని చూసినా అంత అసహ్యమే. నాకు ఈ ఇద్దరిలో తేడా ఏమీ లేదు. నేనుచేసే ఈ సత్యప్రమాణం ఫలి తంగా మేలుకలిగి, విషం విరిగి, యజ్ఞ దత్తుడు పూర్ణజీవుడౌగాక !]

ఈ సత్యప్రమాణంతో యజ్ఞదత్తుడి శరీ రంలోనుంచి విషం పూర్తిగా బయటికి వచ్చి నేలలో ఇంకిపోయింది. వాడు లేచి ఎప్పటి లాగే ఆడుకోసాగాడు.

మాండవ్యుడు కృష్ణద్వైపాయనుడి కేసి తిరిగి, "స్వామీ, మీరు ఉత్తమోత్తమమైన తపస్విజీవితాన్ని స్వీకరించికూడా దాన్ని ఇష్టంలేకుండా సాగించటానికి కారణ మేమిటి?" అని అడిగాడు.

అందుకు కృష్ణద్వైపాయనుడు: "దానికి ఒకటే కారణం. ఒకసారి సన్యసించి వెళ్ళి పోయినవాడు తిరిగి సంసారంలోకి అడుగు పెడితే అందరూ హేళనచేసి, మూఢుడని నిందిస్తారు! అందుచేత, ఆ జీవితం నాకు ఇష్టం లేకపోయినప్పటికీ అందరూ నన్ను



గౌరవంగా చూడగలందులకై నేను తపస్విగానే ఉండి పోయాను! మరి నీవు అతిథి అభ్యాగతులకు ఇంత ఘనంగా అతిథ్యం ఇస్తావు గదా, ఆ పని అయిష్టంగా చెయ్యటానికి కారణమేమిటి ?" అని అడిగాడు.

"నా తాతా, తండ్రీ జగత్ప్రసిద్ధి పొందిన దాతలు. అందుచేత నేనుకూడా వారి మార్గమే అనుసరించవలిసి వచ్చింది. వారి కీర్తికి కళంకం తెచ్చానని జనం నన్ను ఆడిపోసుకోకుండా ఉండ గలందులకై నేను వితరణగా దానధర్మాలు చేశాను; నాకు వాటియందు ఏ మాత్రమూ ఇష్టంఉండి కాదు," అని జవాబు చెప్పి, మాండవ్యుడు తన భార్యకేసి తిరిగి, "పసి తనంలోనే నాకు భార్యవై నా యింటికి వచ్చావు. ఇన్నేళ్లుగా నాతో కాపురంచేశావు. నాపైన ప్రేమాభిమానాలు లేని ఈ జీవితం నీకెంతో రోతపుట్టించి ఉండాలి. దానిని ఎందుకు సహించావు?" అని అడిగాడు.

దానికి మాండవ్యుడి భార్య, "మన వంశంలో స్త్రీ తన భర్తతో కాపరం చెయ్యటం విధి గనక ఈ జీవితం భరించాను. నేను మిమ్మల్ని విడిచి వెళ్లిపోయి మరొక భర్తను కట్టుకున్నట్టయితే లోకమంతా నన్ను కులటగా భావించి ఉండేది. మన అబ్బాయి క్షేమంకోరి మాత్రమే నేనీ విషయం బయటపెట్టాను!" అని సమాధానం చెప్పింది.

"నిజం చెప్పినందుకు నేను నిన్ను తప్పుపట్టను. ఇకముందు నిన్ను ప్రేమతో చూస్తానని ప్రమాణంకూడా చేస్తున్నాను!" అన్నాడు మాండవ్యుడు తన భార్యతో.

"నీవు దానాలు చెయ్యదలిస్తే ఇష్టంతోనే చెయ్యిగాని, ఇష్టంలేకుండా చెయ్యకు. నేనుకూడా ఇకమీదట ఈ తాపసిజీవితం మనస్ఫూర్తిగా సాగిస్తాను!" అంటూ కృష్ణద్వైపాయనుడు మాండవ్యుడివద్ద సెలవు పుచ్చుకుని తన దారిన తాను వెళ్లిపోయాడు.






## 5

[పద్మపాదుడు ; పింగళుణ్ణి, భల్లూకకేతుడి మాయలో పడకుండా రక్షించిన తరవాత— యిద్దరూ కలిసి, భల్లూకపర్వతాలకు బయలుదేరారు. దారిలో వాళ్ళకు పొగల రూపంలో, సుడులు తిరుగుతూ కదిలే పిశాచాలు కనిపించినై. మొసళ్ళ రూపంలో వున్న మహామాయుడి శిష్యులు, పద్మపాదుడికి సహాయం చేసేందుకు అంగీకరించి అదృశ్యులై పోయారు.]

మహామాయుడి శిష్యులిద్దరూ అదృశ్యులై పోగానే, పింగళుడు ఆశ్చర్యపడుతూ, పద్మపాదుడికేసి చూసి, "పద్మపాదా! ఆ ఇద్దరూ తిరిగి మొసళ్ళ రూపంలో ఈ నదిలో ప్రవేశించలేదుగదా?" అని అడిగాడు.

"మొసళ్ళ రూపంలోనా?" అంటూ పద్మపాదుడు ఉలిక్కిపడి, అంతలోనే సర్దుకుని నవ్వుతూ, "పింగళా, వాళ్ళిద్దరూ నిజంగా మళ్ళీ మొసళ్ళ రూపం ధరిస్తే, కథ మొదటికి వస్తుంది. వాళ్లను చేజిక్కించుకునేందుకు నా సోదరులిద్దరూ ఆహుతి అయిన సంగతి నీకు తెలుసుగదా? నేను కూడా వారి బారినుంచి కొనప్రాణాలతో బతికి బయటపడ్డాను," అన్నాడు.

"అయితే, వాళ్ళిప్పుడు ఎక్కడికి వెళ్ళినట్టు?" అని ప్రశ్నించాడు పింగళుడు.

"వాళ్ళు ఎక్కడికి ఏ రూపంలో వెళ్ళారనేది అంత ముఖ్యంకాదు. మనం ఈ నదీగర్భంలో ఉన్న పాడుబడిన దేవళంలో ప్రవేశించవలసి ఉంది. ఆ దేవళంలో గల అయిదు ద్వారాలను తెరుచుకుంటే తప్ప, మనం మహామాయుడు సమాధి





మహామాయుడి శిష్యులు యిద్దరూ తప్పక సహాయంచేస్తారు" అన్నాడు.

"ఇంత గొప్ప నదిలో—ఒక్క నీటి చుక్కకూడా లేకుండా చేయటమా?" అంటూ పింగళుడు ఆశ్చర్యం కనబరిచాడు.

"అవును, అలా చేసినప్పుడే మన కార్యం నెరవేరుతుంది. నేను ఇప్పుడే మంత్రనిష్ఠకు పూనుకోబోతున్నాను. దాన్ని మహామాయుడి స్వాధీనంలో ఉన్న దుష్ట శక్తులు పాడుచేయకుండా కాపాడవలసిన బాధ్యత నీది. అంటే—ఒకరకంగా నువ్వే నన్ను రక్షించవలసి ఉంటుందన్నమాట!"

"నేను మిమ్మల్ని రక్షించటమా?" అని పింగళుడు అదుర్దాగా ప్రశ్నించాడు.

"అవును, నువ్వే నన్ను రక్షించవలసి వుంటుంది. నేను మంత్రనిష్ఠలో ఉండగా నా చుట్టూ ఏమి జరుగుతుందో నాకు తెలియదు. కనుక, ఆయుధపాణివై నీవే నన్ను సదా కాపాడవలసి ఉంది. ఇదుగో ఆయుధం!" అంటూ పద్మపాదుడు గాలిలో చేయి చాచి ధగధగమని మెరుస్తూ కళ్ళకు మిరుమిట్లు కొల్పుతున్న ఒక గదను అందుకుని, పింగళుడికి ఇచ్చాడు.

పింగళుడు, పద్మపాదుడినుంచి గదను అందుకుని దానిని గిరగిర తిప్పిచూచి,

అయివున్న గదిని చేరలేము. అందుకు వాళ్లు మనకు సహాయం చేస్తారు," అన్నాడు పద్మపాదుడు.

"నాకు అంత బాగా ఈత రాదు. ఈ నదిలో ఉన్న దేవాలయాన్ని నే నెలా చేరగలను?" అన్నాడు పింగళుడు.

పింగళుడు అమాయకంగా అడిగిన ఈ ప్రశ్నకు పద్మపాదుడు నవ్వి, "పింగళా, నీకు యీదటం చేతకాకపోయినా, తిరుగులేని గుండెనిబ్బరం ఉంటే చాలు! ఈ నదిలో ఒక్క చుక్క నీరుకూడా లేకుండా ముందు చేయవలసివుంది. అందుకు ప్రయత్నిద్దాం. ఆ ప్రయత్నంలో మనకు





భుజాన పెట్టుకున్నాడు. పద్మపాదుడు అతడికేసి ఆప్యాయంగా చూస్తూ, "అయితే పింగళా, ఇక నేను సమాధిలో వుండి మంత్రోచ్చారణ చేస్తాను. మాయారూపాలు ధరించి మనను బాధించవచ్చే మహా మాయుడి పిశాచగణాన్నుంచి నన్నూ, నిన్నూకూడా రక్షించుకోవలసిన బాధ్యత నీది. త్వరలోనే ఈ నదీజలాన్ని స్తంభింప చేసి, ఇంకిపోయేట్టు చేస్తాను," అన్నాడు.

"అలాగే కానివ్వండి. ఈ గద సహాయంతో ఎటువంటి రక్కసులనైనా సరే పారదోలగలను," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు నది ఒడ్డునే పద్మాసనం వేసి కూర్చుని, నదీజలాన్ని రెండు మూడు సార్లు చేతితో కదిపి, "జల—సర్వస్తంభనం...కురు కురు...శీఘ్రం వశ్యం... ఠః ఠః...." అంటూ కళ్లుమూసుకున్నాడు.

పద్మపాదుడు ఆ విధంగా కళ్లు మూసుకునేంతలో, ఆకాశం గింగుర్లెత్తేలా కీచుమన్న వికృత ధ్వని వినిపించింది. పింగళుడు అదిరిపడి, అంతలోనే గుండెనిబ్బరం తెచ్చుకుని, భుజంమీదినుంచి గదను చేతిలోకి తీసుకుని ఆకాశంకేసి చూశాడు.

ఒక్క తృటికాలం ఆకాశమంతా నల్లని కారుమేఘంతో కప్పబడినట్టయింది. చూస్తూండగానే అది కుంచించుకుపోతూ, క్రమంగా ఏనుగు ప్రమాణానికి తరిగిపోయింది. "ఓహో, నన్ను లోగడ ఎదిరించిన మాయా గజం, మళ్లీ నామీదకు వస్తున్నదన్నమాట!" అనుకుంటూ పింగళుడు, గదను గట్టిగా గుప్పెటలో బిగించాడు. కాని ఆ మేఘం ఏనుగు ఆకృతి ధరించక తృటికాలంలో పెద్ద పక్షిలా అయి, రెక్కలు అల్లల్లాడించ సాగింది.

"ఇది పిశాచ గండభేరుండపక్షి, సందేహం లేదు!" అనుకున్నాడు పింగళుడు.

గండభేరుండపక్షి దిక్కులు పిక్కటిల్లేలా కేకరించి రెక్కలాడిస్తూ, సూటిగా పింగ



ళుడు నిలబడివున్న చోటుకు దిగసాగింది. అది క్రమంగా కిందికి వస్తూన్నకొండికీ దాని రెక్కలనుంచి వెలువడే గాలి తాకిడికి ఆ ప్రాంతాల గల చెట్టూ చేమలు తుఫాను దెబ్బకు ఊగిపోయినట్టు ఊగిపోయినై.

పింగళుడు చలించలేదు. ఆ పక్షి తనను కోడిపిల్లను తన్నుకుపోయినట్టు తన్నుకు పోయేందుకు వస్తున్నదని అతడికి తెలుసు. అయినా తన చేతిలో, పద్మపాదుడు యిచ్చిన మంత్రశక్తి గల గద ఉన్నది!

పింగళుడు గదను రెండు గుప్పెట్లలోనూ బిగించి పట్టుకుని పైకెత్తాడు. పిశాచ పక్షి అతన్ని సమీపిస్తున్నది. బారెడు పొడవున



కొసదేరిన ముక్కూ, పదునైన కాలిగోళ్ళూ, నిప్పులు చెరిగే కళ్ళూ-అది చాలా భయం కరంగా, వికృతంగా ఉన్నది. అది దగ్గిరకు వస్తున్నప్పుడు దాని రెక్కల గాలి రివ్వు రివ్వుమంటూ శబ్దం చేయసాగింది. దాని తాకిడికి పింగళుడు ఉన్న చోటున కాలు నిలదొక్కుకోలేక, అల్లంత దూరం కొట్టుకు పోయాడు. అదే సమయంలో పిశాచపక్షి అతడి తలకు దగ్గిరగా ముక్కు సాచింది. పింగళుడు చేతనున్న గదను బలంగా విసి రాడు. కాని పక్షి ఆ దెబ్బ తప్పకుని, వికృ తంగా అరిచి పైకి ఎగిరిపోయింది.

'బతికిపోయాను!' అనుకుంటూ పింగ ళుడు పైకి చూచాడు. పిశాచపక్షి ఆకాశం లోకి చాలా దూరం ఎగిరిపోయి, ఈసారి మరింత వేగంగా కిందికి దిగిరాసాగింది. పింగళుడు పాదాలు భూమిలోకి బాగా గుచ్చి, గద పైకెత్తి సిద్ధంగా ఉన్నాడు. పక్షి రివ్వుమంటూ తలమీదికి వచ్చేసరికి, అతడు గురిగా గదను దాని తలమీదికి విసిరికొట్టాడు. మరుక్షణం కొండ బద్దలయినట్టు ధాం అన్న శబ్దం వెలువడింది. పిశాచపక్షి తునా తునియలై, తల ఒక వైపుకూ, రెక్కలూ, కాళ్ళూ మరొక వైపుకూ చెల్లాచెదరుగా ఎగిరి, మొండెం భూమిమీద పడింది.





పింగళుడు ఆ దృశ్యం చూసి సంతోషం పట్టలేక, 'జై, పద్మపాదా!' అంటూ గదను గిరగిరా తిప్పుతూ గంతులు వేశాడు. తరవాత మంత్రనిష్ఠలో ఉన్న పద్మపాదుణ్ణి చూశాడు. పద్మపాదుడిలో ఏమాత్రం చలనంలేదు. అతడి కళ్లు మూతలుపడి ఉన్నాయి. పెదాలు మాత్రం అప్పుడప్పుడూ కదులుతున్నాయి. "ఈయనకు నిష్ఠాభంగం కలగలేదు, అంతే చాలు!" అనుకుంటూ పింగళుడు వెనుదిరగపోయేంతలో ఘల్లు ఘల్లుమంటూ గజ్జెలమోత వినబడింది.



పింగళుడు నిశ్చేష్టుడయాడు. ఎదురుగా సర్వాలంకారాలతో అప్సరసలా వున్న ఒక యువతి నాట్యంచేస్తూ పాట పాడుతున్నది. ఆమె సౌందర్యం, గంధర్వగానం విని పింగళుడు ఒక్క తృటికాలం తనను తామరిచాడు.

"పింగళా! నీ అందం చూసి నేను ఇక్కడకు వచ్చాను. నన్ను వివాహం ఆడు. నీకు సర్వసంపదలూ సమకూరుస్తాను," అన్నది ఆ యువతి.

ఆ సరికి పింగళుడు తన్నుదా సముదాయించుకుని, "నువ్వు నా అందంచూసి వచ్చావా? నేను ఏ మహారాజు కుమారుణ్ణో అనుకుంటున్నావేమో! అలా పొరబడకు. నేను జాలరి పింగళుణ్ణి!" అన్నాడు.

"జాలరివయితే మాత్రం ఏం? నీ అంత అందగాడు, పధ్నాలుగు లోకాల్లోనూ వుండడు," అంటూ ఆ యువతి నాట్యం ప్రారంభించింది.

పింగళుడు ఆమెకేసి అనుమానంగా చూస్తూ, "నీ గొంతుతోపాటు శ్రుతి కలిపి చాలా పక్కవాద్యాలు వినబడుతున్నవి! ఆ వాద్యగాళ్లంతా, నా కంటికి కనబడరేం?" అన్నాడు.

"నన్ను పెళ్లాడితే తప్ప, నీకు వాళ్లు కనిపించరు. నేను ఖేచరిని!" అన్నది, యువతి.

"నువ్వు ఖేచరివా? ఓహో—ఆకాశంలో సంచరించే గంధర్వకాంత వన్నమాట!"



అంటూ పింగళుడు గద పైకెత్తి, ఆమెను సమీపించబోయాడు.

"పింగళా! ఆ గద దూరంగా పార వెయ్యి. నాకు, ఆయుధాలంటే భయం," అంటూ ఖేచరి వెనక్కు నడిచింది.

దానితో, పింగళుడికి ఆయువతి ఎవరైనదీ అర్థమైపోయింది. పద్మపాదుడికి నిష్ఠాభంగం కలక్కుండా, కాపాడుతున్న తనను, ముందుగా మాయచేసి సంహరించేందుకు వచ్చిన పిశాచమని తెలుసుకున్నాడు. అతడు పొంగివచ్చే కోపాన్ని అణచుకుని, లేని సంతోషాన్ని కనబరుస్తూ, "ఓ, ఖేచర కాంతా మణీ! నిన్ను వివాహమాడేందుకు నా అభ్యంతరం ఏమీలేదు. కాని, సమయానికక్కడ, మా ముత్తాత తాతగారి, మూడవ భార్య లేనందుకు విచారిస్తున్నాను. ఆవిడే నన్ను పెంచి పెద్దవాణ్ణి చేసింది. అయినా ఫరవా లేదు. మా వంశాచారం ప్రకారం, పెళ్లికి ముందు ఈ గదతో నీ నెత్తిమీద ఒక్కసారి మోదనియ్యి," అంటూ ముందుకు వురికాడు.

ఖేచరి కెవ్వున కేకవేసి, వెనక్కు పరిగెత్తబోయింది. యీ లోపల, పింగళుడు తన గదతో, ఆమెను బలంగా నెత్తిమీద కొట్టాడు. మరుక్షణం పెద్ద ధ్వనితో మాయా




రూపంలో వచ్చిన పిశాచిని ముక్కలు చెక్కలుగా పేలి, గాలిలోకి ఎగిరిపోయింది.

పింగళుడు పెద్దగా నవ్వి, వెనుదిరిగి పద్మపాదుడి దగ్గిరకు వచ్చాడు. పద్మపాదుడు యింకా కళ్లు మూసుకునే వున్నాడు. పింగళుడి దృష్టి నదికేసి వెళ్లింది. అతడి ఆశ్చర్యానికి అంతులేదు. నదిలో నీరు చూస్తూండగానే, యింకిపోతున్నది. అప్పటి వరకూ ఆ నీటిలో ఆవాసం ఏర్పరుచుకున్న జలచరాలు, కుప్పతిప్పలుగా బయట పడుతూ—అటూయిటూ గెంతుతున్నవి.

"పింగళా!" అంటూ పద్మపాదుడు కళ్లు తెరిచాడు. పింగళుడు ఒక్క ఎగురున



పద్మపాదుణ్ణి సమీపించి, "పద్మపాదా! నదికేసి చూడు!" అన్నాడు ఆశ్చర్యంగా.

పద్మపాదుడు నదికేసి చూస్తూ, "భేష్, మహామాయుడి శిష్యులు మాట నిలుపుకున్నారు! ఇంతకూ మనకు కావలసిన పాడుదేవళం ఎక్కడ?" అన్నాడు.

పింగళుడు నదిమధ్యకేసి పరీక్షగా చూచి, "అదుగో, యిప్పుడిప్పుడే శిఖరం నీటినుంచి బయటికి వస్తున్నది! అదేనా మహామాయుడు సమాధి అయిన దేవళం?" అని అడిగాడు.

పద్మపాదుడు, పింగళుడు చూచిన వైపుకు చూస్తూ, తృప్తిగా నవ్వి, "అదే పాడుబడిన దేవళం. నదిలో ఒక్క చుక్క నీరు లేకుండా యింకిపోయిన తరవాత, మహామాయుడి శిష్యులిద్దరూ మన దగ్గిరకు వస్తారు. సరే, నేను నిష్ఠలో వుండగా, దాన్ని భంగపరిచేందుకు పిశాచగణమేమీ రాలేదు గదా?" అని అడిగాడు.

పింగళుడు, సంతోషంతో తను సంహరించిన పిశాచ గండభేరుండ పక్షిని గురించీ, ఖేచర కాంతను గురించీ వివరంగా చెప్పాడు. అంతావిన్న పద్మపాదుడు, పింగళుడి భుజం తడుతూ, "పింగళా, గంధర్వ స్త్రీ రూపంలో వచ్చిన పిశాచిని అందానికి వశుడవు కాకుండా నిగ్రహించుకున్నందుకు, నాకు చాలా ఆనందంగా వుంది. నువ్వు. పాడుదేవళంలో ప్రవేశించినప్పుడూ, యిలాంటి పరీక్షలనే కొన్నిటిని ఎదుర్కోవలసి వస్తుంది, జాగ్రత్త!" అన్నాడు.

అంతలో నది మధ్యంనుంచి, "మహామాంత్రికా!" అన్న కేక వినబడింది. పద్మపాదుడూ, పింగళుడూ అటుకేసి చూశారు. ఒక దేవాలయశిఖరం, వారి దృష్టి నాకర్షించింది. దానిపక్కనే నిలబడి, మహామాయుడి శిష్యులిద్దరూ కనిపించారు. వారు, పద్మపాదుడికేసి చూస్తున్నారు.

—(ఇంకా వుంది)





# పిశాచాల దిబ్బ

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు వెళ్ళి, చెట్టుమీదినుంచి శవాన్ని దించి తన భుజాన వేసుకుని, మౌనంగా మరొకమారు శ్మశానంకేసి నడవసాగాడు.

అప్పుడు శవంలో ఉన్న బేతాళుడు, "రాజా, నిన్ను చూస్తే నాకు వీరభానుడనే ఒక సాహసి జ్ఞాపకం వస్తున్నాడు. అతను కూడా నీలాగే ఒంటరిగా పిశాచాలతో తల పడినవాడు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు అతని కథ చెబుతాను, విను!" అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

ఒక గ్రామంలో ఒక అసామీ ఉండే వాడు. అయనకు చాలా భూములుండేవి. కాని అయన పిల్లలు లేకుండా చని పోవటంవల్ల అయన బంధువులందరూ చేరి ఆ భూములన్నిటినీ పంచుకున్నారు.

చచ్చిపోయిన అసామీ తాలూకు భూము లలో సేద్యంలేక బీడుపడివున్న పెద్ద

బేతాళ కథలు



పొలం ఒకటి ఉన్నది. దానిని అందరూ పిశాచాల దిబ్బ అనేవాళ్లు. దానిని ఆసామీ ఎంత మందికో కమతానికిచ్చాడు, కాని ఒక్కరూ దున్ని పండించలేకపోయారు. ఎవరైనా కాడిగట్టి ఆ పొలాన్ని దున్నటానికి ప్రయత్నిస్తే ఎద్దులు బెదిరి తాళ్లు తెంచుకుని పారిపోయేవి. అక్కడ పిశాచాలుండి పొలం సాగుకాకుండా చేస్తున్నాయని అందరూ చెప్పుకునేవారు.

ఈ దయ్యాల దిబ్బ ఎవరికి చెందాలని సమస్య వచ్చింది. అందరూ మాకు వద్దంటే మాకు వద్దన్నారు. చచ్చిపోయిన ఆసామీ తాలూకు దూరపు బంధువులలో గౌరి అనే అమ్మాయి ఉన్నది. ఆ పిల్ల కింకా పెళ్లి కాలేదు. తల్లీ తండ్రీ లేరు. చిన్న గుడిసెలో కాపరం వుంటూ, పెరట్లో కూరగాయలు పండించుకుంటూ, రోజల్లా రాటం వడుకుతూ ఎలాగో తన పొట్ట తాను పోసుకుంటున్నది.

"పాపం, గౌరికి ఈ పొలం ఇస్తే అది చూసి ఎవడన్నా పెళ్లాడతాడు. బొత్తిగా దిక్కులేని ఆ పిల్ల జీవితం ఒక ఒడ్డున పడుతుంది. ఆసామీ ఆస్తిలో ఆ పిల్లకు కూడా వంతు దక్కవలసిందే గదా!" అన్నారు బంధువులు. ఈ ఆలోచనకు అందరూ సమ్మతించారు.

గౌరి బొత్తిగా దిక్కులేని మనిషి కాదు. ఆమెకు కాబోయే భర్త చాలాకాలం క్రితమే నిర్ణయమయాడు. అతని పేరు వీరభానుడు. అతనుకూడా గౌరిలాగే అతి పేదవాడు. డబ్బు సంపాదించుకు వచ్చి గౌరిని పెళ్లాడే ఉద్దేశంతో అతను దేశాంతరాలకు వెళ్ళి ఆ రోజే తిరిగివచ్చాడు.

అతను గౌరి గుడిసెలోకి అడుగు పెట్టేటప్పటికి ఆమె రాటం వడుకుతున్నది. అతనిని చూసి ఆమె పొందిన ఆనందానికి అంతులేదు. వీరభానుడు తన భుజాన ఉన్న మూట దింపి తాను తెచ్చిన డబ్బూ,

నగలూ గౌరికి చూపి, "గౌరీ, ఇదుగో మన సొమ్ము. ఇక మనం పెళ్ళాడి ఒక ఇంటి వాళ్లం కావచ్చు. అచ్చగా దీనిమీదే మనం బతకనవసరంలేదు. నేను కష్టంచేసి నిన్నూ, పుట్టబోయే పిల్లల్నీ పోషిస్తాను," అన్నాడు.

గౌరి సంతోషంతో పెళ్ళికి సమ్మతించింది. ఆ సమయానికే చచ్చిపోయిన ఆసామీ తాలూకు బంధువొకడు వచ్చి, "గౌరీ, నీ అదృష్టం పండింది. పెద్దయ్య ఆస్తిలో నీకుకూడా ఒక వంతు ఏర్పాటు చేశాం. కొండ దిగువను ఉన్న బీడంతా నీకిచ్చేటట్టు మనవాళ్లు నిర్ణయించారు!" అని చెప్పి వెళ్లాడు.

గౌరికి దుఃఖం ఆగలేదు. అందరూ మంచి మంచి పొలాలన్నీ తీసుకుని, తనను దిక్కులేని దాన్ని చేసి పిశాచాల దిబ్బ అంటగట్టారని ఆమె తెలుసుకున్నది.

గౌరి ఎందుకు ఏడుస్తున్నదో వీరభానుడికి అర్థంకాలేదు. ఆమె పిశాచాల దిబ్బను గురించి చెప్పాక అతను, "వెర్రిదానా, పిశాచాలు మనని ఏం చేస్తాయి? ఆ దిబ్బను నేను సాగు చెయ్యకపోతే నాకు మారుపేరు పెట్టు!" అని గౌరిని ఓదార్చాడు.

అతను తనదగ్గిర ఉన్న డబ్బంతా ఖర్చు చేసి ఒకజత ఎద్దులూ, నాగలీ, ఇతర వ్యవసాయ పరికరాలూ కొన్నాడు. అందరూ పొలాలు దున్నబోయే తరుణంలో అతను కూడా ఎద్దులూ, నాగలీ వెంటబెట్టుకుని పిశాచాలదిబ్బ దున్నబోయాడు. కాని అతను దున్నటం ఆరంభించాడో లేదో ఏవో వెర్రికేకలు వినిపించాయి. ఎద్దులు రెండూ బెదిరి పరిగెత్తసాగాయి. వీరభానుడు ఒక ఎద్దునన్నా పట్టుకుందామని ప్రయత్నించాడు. ఎద్దు అతన్ని పడేసి ఈడ్చింది. అతని తల పొలంలో ఉన్న రాయికి తగిలి, పగిలి రక్తం కారసాగింది.



తన భర్త ఎద్దులు లేకుండా, వంటినిండా రక్తప్రవాహాలతో ఇల్లుచేరటం చూసి గౌరికి

గుండె అవిసిపోయింది. ఆమె పెద్దగా ఏడుస్తూ, "నేను చెప్పలేదా? ఆ పాపిష్టి పొలంలో ఎందుకు అడుగుపెట్టావు? ఎన్నో ఏళ్లుతిరిగి సంపాదించుకువచ్చిన డబ్బంతా మాయమైనట్టుగా పోయిందిగద!" అన్నది.

"నన్ను పిశాచాలేమీ చెయ్యలేదు. బుద్ధి లేని జంతువులు కాపటాన గొడ్లు బెదిరాయి. వాటిని పట్టుకోబోయి నేనీ దెబ్బ తగిలించుకున్నాను. ఆ పొలం అంతు కనుక్కోకుండా వదులుతానని ఒక్కనాటికి అనుకోకు!" అన్నాడు వీరభానుడు.

అతను అన్నంత పనీ చేశాడు. రోజూ చీకటితో బయలుదేరి పొలానికి వెళ్లి, మళ్లీ చీకటిపడినదాకా పొలాన్ని పారతోనూ, పలుగుతోనూ తవ్వాడు. ఒంటరిగాడు ఈ ప్రకారం ఎంతమేర వ్యవసాయం చెయ్యగలుగుతాడు? కొద్దిపాటి పొలంలోనే పంట పండించాడు, పంట నూర్చాడు, ధాన్యం ఇంటికి చేర్చాడు.

పిశాచాలు అతన్ని భయపెట్టజూచాయి, కాని అతను వాటిని లక్ష్యపెట్టలేదు. గౌరి అతనివెంట తానుకూడా వచ్చి పొలంపని చేస్తానన్నది. కాని ఆమె గర్భిణిగా ఉండటం వల్ల అతను ఒప్పుకోలేదు. రోజూ అతను ఇంట్లో అడుగుపెట్టేదాకా గౌరి తన ప్రాణాలను అరిచేతిలో పెట్టుకుని కూర్చునేది.



"ఈ గింజలు మన తిండికి చాలు. పైఏడు ఇంతకంటే మొనగాడిపంట పండించకపోతే చూడు!" అన్నాడు వీర భానుడు గౌరితో.

మూడేళ్ళు గడిచాయి. ఆయేటికాయేడు ఎక్కువ పంట పండిందేగాని, ఒంటిమనిషి కృషి కావటంచేతా, ఎద్దులు లేని కారణం చేతా పిశాచాలదిబ్బలో ఒక వంతుకూడా సాగులోకి రాలేదు. ఈలోపుగా గౌరి ఇద్దరు పిల్లల తల్లి అయింది.

ఒకనాడు అతను పొలంలో గడ్డ తిరగ వేస్తుండగా పక్కనే ఎవరో నిలబడి, "ఏం, బాబూ? దేశం గొడ్డుపోయిందా? ఒకజత ఎడ్లను తెచ్చి వ్యవసాయం చేసుకోరాదూ? ఎందుకొచ్చిన శరీరశ్రమ?" అన్నట్టు విని పించింది. వీరభానుడు తల ఎత్తి చూశాడు. బాగా కండలుతిరిగిన శరీరంతో నల్లగా, ఎత్తుగా ఎవడో పక్కన నిలబడి ఉన్నాడు.

ఇది పిశాచమే అని గ్రహించి వీర భానుడు సమాధానం చెప్పక తన పని చూసుకోసాగాడు. అయినా నల్లటివాడు వదిలిపెట్టక, "పలకవేమయ్యా? నీ కష్ట మేమిటో చెప్పకోరాదూ? చేతనైతే సహాయం చేస్తాగా?" అన్నాడు.

వీరభానుడు ఆ నల్లటివాణ్ణి సమీపించి జరిగినదంతా చెప్పి, "నీవెవరో నాకు





తెలుసు. నీ సహాయం నాకేమీ అక్కర్లేదు, వెళ్ళు!" అన్నాడు.

నల్లటివాడు నవ్వి, "నన్ను బాగానే పోల్చుకున్నావు. కాని నేను నీ పొలంలో ఉండే పిశాచాన్ని కాను. ఆ కనపడే కొండ మీద నా నివాసం. నన్ను కొండదేవర అంటారు. నిన్ను చూస్తే నాకూ్కడా మనిషి లాగా కొంతకాలం బతకాలని ఉంది. అందుచేత నన్ను నీ వ్యవసాయకూలీగా పెట్టుకో. ఈ బీడంతా దున్నేసి బంగారం పండించుదాం!" అన్నాడు.

"చూస్తూ చూస్తూ నిన్ను కూలికి ఎలా పెట్టుకోను?" అన్నాడు వీరభానుడు.



"భయమా?" అన్నాడు కొండదేవర.

వీరభానుడికి పౌరుషం వచ్చింది. "సరే, అలాగే పెట్టుకుంటాను. 'కొండడూ' అని పిలుస్తాను. నా భార్యదగ్గిరా, పిల్లలదగ్గిరా నువు మనిషిలాగే ఉండాలిగాని నీ జిత్తులు చూపగూడదు. దీనికి సమ్మతిస్తే నాకింద పనిచెయ్యి. లేకపోతే నీ దారిన పో!" అన్నా డతను.

అందుకు కొండదేవర ఒప్పుకున్నాడు. కొండడి సలహామీద వీరభానుడు మరొక ఎద్దుల జత కొన్నాడు. వాటితో బీడంతా దున్నాడు. కొండడిది యమబలం. ఎంత కష్టపడి పని చేసినా వాడికి అలుపు లేదు. ఆయేడు పిశాచాల దిబ్బలో నిజంగానే బంగారం పండింది. ఊళ్ళో అందరూ వీరభానుణ్ణి చూసి అసూయపడ్డారు.

ఒకనాడు గౌరి కొండణ్ణి తన పిల్లలకు తోడు ఉంచి, ఊళ్ళో ఎవరికో జబ్బుగా ఉంటే చూడబోయింది. వీరభానుడు పనిమీద ఊళ్ళోకి వెళ్లాడు. అతను ఇంటికి తిరిగివచ్చేసరికి పిల్లలు చావుకేకలు పెట్టటం వినిపించింది. అతను పరిగెత్తుకుంటూ వెళ్లి చూసేసరికి పిల్లలు గాదెవెనక దూరి, "అమ్మో! బాబో!" అని అరుస్తున్నారు. కొండడు విరగబడి నవ్వుతున్నాడు.



"ఏం చేస్తున్నావురా, పశువా?" అని అడిగాడు వీరభానుడు.

"పిల్లల్ని అడిస్తున్నా!" అన్నాడు కొండడు నవ్వుతూ.

"కాదు, నాన్నా! వాడు మమ్మల్ని భయపెడుతున్నాడు. తన తల గొర్రె తలా, సింహం తలా, గాడిద తలా చేస్తున్నాడు!" అన్నారు పిల్లలు.

వీరభానుడు పిల్లలకు ధైర్యం చెప్పి, "బయటికి పద! మళ్లీ నాకు నీ మొహం చూపించకు!" అంటూ కొండణ్ణి బయటికి లాక్కుపోయాడు. కొండడు మర్యాదగానే బయటికి వచ్చాడు. కాని బయటికి వచ్చాక, "ఏం ఎందుకు పోవాలీ?" అన్నాడు.

"నా పిల్లల్నెందుకు భయపెట్టావ్? నేను మొదటే చెప్పాను! నువు నా కింద పని చెయ్యటానికి వీల్లేదు," అన్నాడు వీరభానుడు కోపంగా.

"నేను లేకుండా ఆ పొలమంతా నువే సాగు చేస్తావా?" అని అడిగాడు కొండడు.

"నాచేతనైనంత చేసుకుంటాను. నువు ముందు పద!" అన్నాడు వీరభానుడు.

"నేను పోను! ఏం చేస్తావు? నేనెవరో నీకు బాగా తెలుసుగా?" అన్నాడు కొండడు. మరుక్షణం వీరభానుడు వాడిమీద



కలియబడ్డాడు. ఇద్దరూ చాలాసేపు కొట్టుకున్నారు. చివరకు ఎలాగో వీరభానుడు కొండణ్ణి పడేసి గుండెలమీద కూచుని చావుదెబ్బలు కొట్టాడు. కొండడు విరగబడి నవ్వసాగాడు. ఆ నవ్వు విని వీరభానుడికి మరింత ఆగ్రహం వచ్చి, "నీకు నవ్వులాటగా ఉందా? తిన్న దెబ్బలు చాల లేదా?" అంటూ ఇంకా గట్టిగా కొట్టాడు.

"చాలు, చాలు! నువే గెలిచావు. నన్ను లేవనీ!" అన్నాడు కొండడు.

తరవాత కొండడు లేచి నిలబడి మళ్లీ నవ్వుతూ, "నీవంటి వాణ్ణి నే నెక్కడా చూడలేదు. నీ ఇష్టప్రకారమే నేను వెళ్లి

పోతున్నాను. ఇక నీ పొలం నువే చూసుకో. కాని పిశాచాలేవైనా నిన్ను బాధిస్తే, 'కొండా!' అని ఒక్క కేక పెట్టు. నేను వెంటనే వచ్చి వాటి సంగతి తేలుస్తాను !" అంటూ, నిలబడ్డవాడు నిలబడ్డట్టే మాయమయాడు.

ఆ తరవాత వీరభానుణ్ణి ఏ పిశాచాలూ బాధించ లేదు. అతనిది ఆ ఊళ్ళో ఉన్న పొలాలన్నిటికన్నా మంచి పంటలు పండే పొలమయింది. గౌరితోనూ, పిల్లలతోనూ అతను సుఖంగా జీవించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం కలిగింది. కొండదేవర వీరభానుడికింద పాలికాపుగా పని చెయ్యటానికి వచ్చిన కారణం ఏమిటి? వచ్చినవాడు తన యజమానికి ఎందుకు ఎదురు తిరిగాడు? మానవమాత్రుడైన వీరభానుడు కొండదేవరను ఎలా ఓడించగలిగాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది!" అన్నాడు.

"వీరభానుడికి పిశాచాల బాధ లేకుండా చేసే ఉద్దేశంతోనే కొండదేవర అతనివద్ద పాలికాపుగా చేరాడు. కొండడి సహాయంతో వీరభానుడు బాగుపడ్డాడు కూడా. కాని వీరభానుడికి ధనంమీద ఎక్కువ ప్రేమో, తన భార్యా బిడ్డలమీద ఎక్కువ ప్రేమో పరీక్షించాలని కొండదేవరకి కోరిక కలిగి, వీరభానుడికి కోపం తెప్పించాడు. కొండడు వెళ్లిపోతే తనకు కలిగే నష్టం గ్రహించికూడా వీరభానుడు అతన్ని వెళ్లిపొమ్మన్నాడు. అంతేకాదు, పిశాచాలకు రాజైన కొండడి మీద కలియబడ్డాడుకూడా. అది చూసి కొండడు సంతోషించి తాను ఓడినట్టు ఒప్పుకున్నాడు. అంతేగాని వీరభానుడు నిజంగా కొండదేవరను ఓడించలేదు," అని విక్రమార్కుడు జవాబు చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. (కల్పితం)





# వింతతీర్పులు

ఇరానుదేశంలోని ఒక నగరంలో ఒక వర్తకుడుండేవాడు. రోజులు కలిసిరాక ఆ వర్తకుడు డబ్బుచిక్కుల్లో పడి పోయాడు. ఆ చిక్కులనుంచి బయట పడటానికని అతను ఒక యూదు వడ్డీవ్యాపారస్తుడివద్దకు వెళ్ళి నూరు దీనారాలు అప్పు పెట్టమనీ, ఎంత వడ్డీ అయినా ఇచ్చుకుంటాననీ అన్నాడు. వడ్డీమాట అటుంచి అసలుకే మోసంవస్తుందనుకుని వడ్డీవ్యాపారస్తుడు అప్పీయ నిరాకరించాడు. కాని వర్తకుడు ఏ షరతుమీదనైనా సరే ఇచ్చి తీరాలని పట్టుబట్టాడు.

"నాకు నీ వడ్డీ వద్దు. గడువులోపల బాకీ తీర్చకపోయావో నీ వంటినుండి శేరు మాంసం కోసి తీసుకుంటాను. ఇష్టమేనా?" అన్నాడు వడ్డీవ్యాపారస్తుడు.

"నేను అందుకుకూడా సిద్ధంగానే ఉన్నాను. ఎందుచేతనంటే ఈ డబ్బుతో నేను వ్యాపారంచేసి గడువులోపల తప్పక నీ బాకీ తీర్చగలను!" అన్నాడు వర్తకుడు.

వడ్డీవ్యాపారస్తుడు అదేప్రకారం పత్రం రాసి, దానిమీద వర్తకుడిచేత సంతకం చేయించుకుని, నూరు దీనారాలూ ఇచ్చేశాడు. వర్తకుడు ఆ సొమ్ముతో సరుకు కొని వ్యాపారం చెయ్యటానికి బయలుదేరాడు. వ్యాపారం కలిసివచ్చింది. వర్తకుడు తన లాభంలోనుంచి నూరు దీనారాలు తీసి తన భార్యకు పంపుతూ, "వీటిని యూదు వడ్డీవ్యాపారస్తుడికి చెల్లించి బాకీ తీర్చు!" అని కబురుచేశాడు.

వర్తకుడి భార్యకు పత్రంగురించి తెలియదు. "బాకీ నిమ్మళంగా తీర్చుకోవచ్చు, ఈ డబ్బు ఇంటిఖర్చుకు వాడేస్తాను," అనుకుని ఆమె ఆ ప్రకారమే చేసింది.

వర్తకుడు కొంతకాలానికి వ్యాపారం ముగించి తన లాభమంతా మూటకట్టుకుని

ఎం. ఎస్. భుజంగరావు



ఇంటిదారి పట్టాడు. దారిలో అతన్ని దొంగలు దోచి, కట్టుబట్టలతో వదిలారు. అయినప్పటికీ వర్తకుడు అంతగా విచారించ లేదు; ఎందుకంటే, తన భార్య యూదు వర్తకుడి బాకీ చెల్లవేసి ఉంటుందని అతను అనుకున్నాడు.

ఇంటికి వచ్చాకగాని వర్తకుడికి ప్రమాదం జరిగిపోయినట్టు తెలియలేదు. వడ్డీవ్యాపారస్తుడి బాకీ అలాగే ఉండి పోయింది. దాన్ని చెల్లించటానికి తనవద్ద యిప్పుడు డబ్బు లేదు. బాకీ తీర్చే గడువు కూడా వెళ్ళిపోయింది. వర్తకుడు వడ్డీ వ్యాపారస్తుడి దగ్గిరికి వెళ్ళి జరిగినదంతా చెప్పుకుని బ్రతిమాలాడు. కాని వడ్డీ వ్యాపారస్తుడు నమ్మలేదు. "ఏం జరిగితే నాకేం? నా డబ్బు నాకు కావాలి. నీదగ్గిర డబ్బు లేకపోతే శేరుమాంసమూ కోసి తీసు కుంటాను!" అన్నాడాయన.

వర్తకుడు ఎంత ప్రాధేయపడినా లాభం లేకపోయింది. వడ్డీవ్యాపారస్తుడూ వర్త కుడూ కలిసి ఎమెస్సానగరంలో ఉండే కాజీవద్ద ఫిర్యాదుచేసి, ఆయన తీర్పు తెలుసుకోవటానికి బయలుదేరారు.

దారిలో వారికొక కంచరగాడిద ఎదు రయింది. అది తప్పించుకుని తమవైపే పారిపోయి వస్తున్నది. దాని యజమాని తరుముకుంటూ వస్తున్నాడు. ఎదురుగా వచ్చే ఇద్దరినీ చూసి కంచరగాడిద యజ మాని, "అయ్యా, దాన్ని అపండి! మళ్లిం చండి!" అని కేకలుపెట్టాడు.

వర్తకుడు ఒక రాయి తీసి కంచరగాడి దను బలంగా కొట్టాడు. రాయి కంచర గాడిద కంటికి తగిలి కన్ను కాస్తా పోయింది. దాని యజమాని వర్తకుడితో పోట్లాట వేసుకుని, "ఇది ఖరీదైన కంచర గాడిద. దాని కన్నుకాస్తా పోగొట్టావు. నాకు నష్టం కలిగించావు. అందుచేత పరిహారం చెల్లించి మరీ కదులు!" అన్నాడు.

"ఈ మనిషిని నిలవేసే అధికారం నీకు లేదు. నీకన్న ముందే నాకు ఋణపడి ఉన్నాడు. మేము కాజీవద్దకు పోతున్నాము. కావలిస్తే నువుకూడా మా వెంట వచ్చి ఫిర్యాదు చేసుకో!" అన్నాడు వడ్డీ వ్యాపారస్తుడు.

కంచరగాడిద యజమానికూడా వాళ్ళ వెంట ఎమెస్సానగరానికి బయలుదేరాడు.

మర్నాడు వారికి దారిలో ఒక దృశ్యం కనిపించింది. వీపున బరువువేసుకుని ఉన్న ఒక గాడిద బురదలో ఇరుక్కుపోయి కదల లేకుండా ఉన్నది. దాని యజమాని ఒంటరిగా ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండి, ఈ ముగ్గురినీ చూసి కాస్త సాయంపట్టమని కోరాడు. ముగ్గురూ గాడిదను బురదనుంచి బయటికి లాగటానికి పూనుకున్నారు. వడ్డీ వ్యాపారస్తుడూ, కంచరగాడిద వాడూ గాడిదమీద బరువును చెరొక పక్కా పట్టుకుని తోయసాగారు. అదృష్టహీనుడైన వర్తకుడు మటుకు గాడిద తోక పట్టుకుని బలంగా లాగాడు. ఆ తోక కాస్తా ఊడి అతని చేతుల్లోకి వచ్చేసింది.

"నా గాడిద తోక తెంపావు. నాకు నష్టం కలిగించావు. పరిహారం చెల్లించి మరీ కదులు!" అన్నాడు గాడిద యజమాని.



మిగిలినవాళ్లు అతన్నికూడా తమవెంట కాజీదగ్గిరికి రమ్మని సలహా ఇచ్చారు.

నలుగురూ కలిసి ప్రయాణించేసి త్వరలోనే ఎమెస్సానగరం చేరారు. రాజవీధిన పోతూండగా వారి కొక పెద్దమనిషి గాడిద మీద సవారీఅయి పోతూ కనిపించాడు. చూడటాని కాయన పెద్ద అధికారిలాగే ఉన్నాడు. కాని తప్ప తాగి, ఏ క్షణాన కింద పడిపోతాడో అన్నట్టు తూలుతున్నాడు. విచారించగా ఆయన ప్రభుత్వ తాఖీదారని తెలిసింది.

మరి కొంత దూరం పోయాక వారు మసీదువద్దకు వచ్చారు. అక్కడ వంద

లాది జనం చేరి విచ్చలవిడిగా జూదం ఆడటం కనిపించింది.

ఇంకా కొంత దూరం పోయాక వారి కొక పాడె ఎదురయింది. పాడెమీద ఉన్న మనిషి అటూ ఇటూ కొట్టుకుంటూ, దారే పోయేవాళ్ళతో, "అయ్యా, మీరే చెప్పండి! నేను చచ్చానని తీసుకుపోయి పాతేస్తున్నారు. నేను చచ్చానా?" అని చెప్పుకుని ఏడుస్తున్నాడు.

"అవును నువు తప్పక చచ్చావు!" అని దారే పొయ్యేవాళ్లు చెబుతున్నారు.

ఈ వింతలు చూస్తూ నలుగురూ ఆ రాత్రికి నగరంలో బస చూసుకుని మర్నాడు ఉదయం కాజీగారి ముందు హాజరయారు.

"మీ ఫిర్యాదులు ఒక్కొక్కటే చెప్పండి!" అన్నాడు కాజీ.

"అయ్యా, ఈ వర్తకుడు నావద్ద నూరు దీనారాలు అప్పు పుచ్చుకుని ఈ పత్రం రాసి ఇచ్చాడు. గడువు లోపల బాకీ తీర్చక పోతే అతని శరీరంనుంచి నేను శేరు మాంసం కోసుకోవచ్చు. గడువు దాటి పోయింది. ఇతను నాకు డబ్బు చెల్లవెయ్యా లేదు. మాంసం కోసుకుంటానంటే అది న్యాయవిరుద్ధమని పేచీ పెడుతున్నాడు!" అన్నాడు వడ్డీవ్యాపారస్తుడు.



కాజీ పత్రం తీసి చదువుకుని, "ఈ పత్రంప్రకారం నీకు ఇతని మాంసం ఒక శేరు తీసుకునేటందుకు పూర్తి హక్కున్నది! అలాగే తీసుకుందువుగాని. కత్తి తీసి పదును పెట్టుకో!" అన్నాడు.

వర్తకుడికి ముచ్చెమటలు పోశాయి, చేతులూ కాళ్ళూ చల్లబడ్డాయి.

కత్తి నూరుకుని వర్తకుడి మాంసం కొయ్యటానికి సిద్ధంగా ఉన్న వడ్డీవ్యాపారస్తుడితో కాజీ, "నీకు ఒక శేరు మాంసం తీసుకునే హక్కు మాత్రమే ఉంది. దానికి ఒక చీమతల అంత ఎక్కువ తీసినా, తక్కువ తీసినా ఈ పత్రంలో ఉన్న షరతుకు భంగం కలుగుతుంది. చట్టవిరుద్ధంగా ప్రవర్తించినందుకు నిన్ను ఉరితీయించ గలను!" అన్నాడు.

వడ్డీవ్యాపారస్తుడు తెల్లబోయి, "అది ఎలా సాధ్యమవుతుంది?" అన్నాడు.

"సాధ్యంగాని షరతు పత్రంలో ఎందుకు పెట్టించావు. తీసుకుంటే నీ శేరు మాంసం తీసుకో. లేదా, ఈ మనిషిని హైరానపెట్టి ఇక్కడికి ఈడ్చుకు వచ్చినందుకు పరిహారంకింద రెండు వందల దీనారాలిచ్చుకో!" అన్నాడు కాజీ.

చేసేది లేక వడ్డీవ్యాపారస్తుడు రెండు వందల దీనారాలూ కాజీముందు పెట్టాడు.





తరవాత కంచరగాడిద యజమాని తనకు జరిగిన నష్టంగురించి చెప్పి, "అయ్యా, నా కంచరగాడిద వెయ్యి దిరాముల విలువగలది. ఈ వర్తకుడు దాని కన్ను పోగొట్టి దానికి విలవలేకుండా చేశాడు! తమరు న్యాయంచేయించాలి!" అని విజ్ఞాపన చేసుకున్నాడు.

"ఈ భాగ్యానికి నాదాకా రావాలా? ఒక రంపం తెప్పించి నీ కంచరగాడిదను నిలువునా కోయించు. మంచి కన్నుగల భాగం నువ్వుంచుకో, గుడ్డికన్ను భాగం వర్తకుడికిచ్చేసి, ఆయన దగ్గరనుంచి 500 దిరాములు పుచ్చుకో!" అన్నాడు.



కంచరగాడిద యజమాని ఈ తీర్పు విని లబలబలాడుతూ, "ఇప్పటికైనా నా కంచరగాడిద విలవ 750 దిరాములకు తగ్గదు. నాకు పరిహారమూ వద్దు, పాడూ వద్దు. నాదారిన నన్ను పోనివ్వండి!" అని కాజీని వేడుకున్నాడు.

"అనవసరంగా న్యాయస్థానానికి ఈడ్చినందుకుగాను ఈ వర్తకుడికి నువు నూరు దీనారాలిచ్చుకోవలిసి ఉంటుంది," అన్నాడు కాజీ.

కంచరగాడిద యజమాని చేసేదిలేక తీర్పు ప్రకారం నూరు దీనారాలూ కాజీ ఎదట ఉంచాడు.

తరవాత గాడిద యజమాని ముందుకు వచ్చి వర్తకుడు తన గాడిదతోకను తెగలాగిన సంగతి చెప్పుకున్నాడు.

కాజీ అంతా విని, "అసంభవం! ఈ మనిషి లాగటంచేత నీ గాడిద తోక ఊడి వచ్చిందని నేను నమ్మను. అదిగో అక్కడ నిలబడి ఉన్న నా గాడిదతోక లాగి తెంపు చూద్దాం!" అన్నాడు.

ఫిర్యాది కాజీగారి గాడిదతోక పట్టుకుని లాగిచూశాడు. అది వెనకకాళ్ళతో అతన్ని మొహం పగిలేటట్టు తన్నింది. ఈ విధంగా మూడుసార్లు ప్రయత్నించి గాడిదచేత



తన్నులు తిన్నాక, ఫిర్యాదితో కాజీ, "చూశావా? నీ గాడిదకు అసలు తోకే లేక పోయి ఉండాలి. నువు ఈ మనిషిమీద అక్రమంగా నేరం మోపినందుకు నీకు నూరు దీనారాలు జరిమానా విధించాను, వెంటనే చెల్లించు!" అన్నాడు.

న్యాయం పొందటానికి బదులు డబ్బు వదిలించుకుని ఫిర్యాదీలు వెళ్ళిపోయారు. వారిచ్చిన డబ్బులో సగం వర్తకుడి కిచ్చి మిగిలినది తన జేబులో వేసుకుంటూ కాజీ, "నేను అన్యాయం ఏమాత్రమూ సహించను. నా తీర్పులు నీకు న్యాయంగా కనబడ్డాయనుకుంటాను!" అన్నాడు.

"చిత్తం, చిత్తం! తమరిని కొన్ని సందేహాలు అడగాలనుకున్నాను. దయఉంచి నా సందేహాలు తీరుస్తారా!" అన్నాడు వర్తకుడు వినయంగా.

"అడుగు! ఏమిటి నీ సందేహాలు?" అన్నాడు కాజీ.

"మేం వస్తుండగా ప్రభుత్వ తణిఖీదారు గారు తప్పతాగి గాడిదమీద తూలుతూ పోతూండటం కనిపించింది. అంత పెద్ద ఉద్యోగి అలా తూలటం చూసి నాకు ఆశ్చర్యం కలిగింది. దానికి కారణమేమిటి?" అని వర్తకుడు అడిగాడు.



"ఈ నగరంలో చాలా సారా దుకాణాలున్నాయి. దుకాణాలవాళ్ళు డబ్బుకు ఆశించి ఘాటైన మత్తు పదార్థాలు వాటిలో కలుపుతూంటారు. అది చట్టవిరుద్ధం. వాళ్లు అలాటి పని చెయ్యకుండా చూడటం తణిఖీదారుగారి పని. అందుచేత ఆయన ప్రతి దుకాణానికి వెళ్లి సారా కొంచెం కొంచెం రుచి చూస్తారు. మత్తుపదార్థాలు కలిపిన దొంగ సారా రుచిచూడటంచేత ఆయనకు త్వరలోనే తూలుడు ప్రారంభమవుతుంది. దాన్ని గురించి చెయ్యగలిగినదేమీ లేదు. దొంగ సారా తయారుచేసే వాళ్లను పట్టుకునేందుకు వున్నమార్గం అదే!" అన్నాడు కాజీ.

"మసీదులో ఎవరి ఆటంకమూ లేకుండా అంత చురుకుగా జూదం నడుస్తున్న దేమిటి?" అని వర్తకుడు అడిగాడు.

"అదీ చట్టసమ్మతంగానే జరుగుతున్నది. అసలు సంగతేమిటంటే మసీదుకు ధనం లేదు. అందుచేత అందులో జూదశాలలు పెట్టుకోవటానికి అనుమతించాము. జూదాలమీద వచ్చిన లాభాలతో మరమ్మతులు వగైరాలు జరిపించి, మసీదుకు నిధి చేర్పాటుచేస్తాము! ఆ విధంగా మసీదుకు వచ్చేపోయే వారికి అనేకమైన సౌకర్యాలు కన్పించే అవకాశం కలుగుతుంది. ఇది అన్నివిధాలా మంచిపనే గదా?" అన్నాడు కాజీ.

"ఒక మనిషిని బతికుండగానే పాడెమీద పెట్టి తీసుకుపోతున్నారేమిటి? వాడు బతికేవున్నానంటున్నాడు. మిగిలినవాళ్లంతా చచ్చావు అంటున్నారు. ఈ వింత ఏమిటి?" అని వర్తకుడు అడిగాడు.

"వాడు చట్టవిరుద్ధంగా మాట్లాడుతున్నాడు! రెండు నెలల క్రితం వాడి భార్య నావద్దకు సాక్షులతోసహా వచ్చి తన భర్త చచ్చిపోయాడనీ, తిరిగి వివాహమాడటానికి తనకు అనుమతి నివ్వమనీ కోరింది. సాక్ష్యం ఆధారంతో నేను అలాగే చేశాను. తరవాత వాడు వచ్చి తన భార్యను తనకు తిరిగి ఇప్పించమనీ, తాను బతికే ఉన్నాననీ అన్నాడు. చట్టప్రకారం సాక్ష్యం ఆధారంతో నే నిచ్చిన తీర్పును మార్చటానికి వీలు లేదుగద! అందుచేత వాడి చావు ఖరారు చెయ్యటంకోసం వాణ్ణి పాతిపెట్టవలిసిందిగా ఉత్తరువు జారీచేశాను. అదీ జరిగిన సంగతి!" అన్నాడు కాజీ.

ఈ కాజీగారి తీర్పులు చూసి వర్తకుడికి అమిత ఆశ్చర్యం కలిగింది. కాని ఆ తీర్పుల మూలంగానే తనకు చావు తప్పింది గనక పైకి ఏమీ అనక, కాజీవద్ద సెలవు పుచ్చుకుని వర్తకుడు ఇంటికి తిరిగి వెళ్లిపోయాడు.



# వ్యత్యాసం

ఒకప్పుడు ఇద్దరు రాజుల మధ్య కలహం వచ్చింది. వారిలో ఒకడు నిజమైన రాజపుత్ర క్షత్రియుడు. రెండవవాడు అదృష్టం కలిసివచ్చి రాజైన నీచుడు.

ఈ నీచుడు ఒక చాటింపు వేయించాడు: తన శత్రువును చంపి అతని తల తెచ్చినవారికి లక్షరూపాయలు బహుమానం ఇస్తానన్నాడు.

అంతటితో కసితీరక ఆ నీచుడు తన శత్రువుకు ఈ విధంగా లేఖ రాశాడు: "నా దృష్టిలో నీవొక కుక్కలాటివాడివి. నీ ప్రాణానికి లక్ష రూపాయలు విలువకట్టాను. నీ తల నరికి తెచ్చినవాడికి ఆ మొత్తం ఇస్తానని నా దేశమంతటా చాటింపు వేశాను."

ఈ లేఖకు రాజపుత్రుడు ఇలా జవాబిచ్చాడు: "నా దృష్టిలో నీవుకూడా ఒక రాజువే. కాని నీ ప్రాణానికి నేను విలువ ఇవ్వను. నీ తల నరికి తెచ్చినవాడికి నానుంచి ఒక్క దమ్మిడీకూడా ముట్టదు."

ఈ జవాబు చూసి నీచుడు నిర్ఘాంతపోయాడు.





# స్వయంప్రభ

గిరిదుర్గమనే పట్టణాన్ని ఇంద్రమిత్రుడనే రాజు పాలించేవాడు. ఆయనకు లేకలేక ఒక ఆడపిల్ల కలిగింది. ఆ పిల్లకు స్వయం ప్రభ అని పేరుపెట్టుకున్నారు. ఆమెకు చిన్నతనంనుంచీ తపస్సుచేయాలనీ, మోక్షం సంపాదించాలనీ కోరిక ఉండేది.

స్వయంప్రభ పెద్దదై పెళ్లియీడు రాగానే ఆమె తలిదండ్రులు నూరుగురు రాజ కుమారుల చిత్తరువులు తెప్పించి, వారిలో ఒకరిని భర్తగా ఏరుకోమన్నారు. కాని స్వయంప్రభ తనకు వివాహం చేసుకోవటం ఎంతమాత్రమూ ఇష్టంలేదని చెప్పేసింది.

ఇది జరిగిన కొద్దిరోజులకు వీణావతి అనే ప్రసిద్ధగాయకి గిరిదుర్గానికి వచ్చింది. వీణావతివద్ద అపూర్వమైన వీణ ఒకటి ఉన్నది. ఆ వీణమీద ఆమె రాజసభ లలో పాటకచేరీలు చేసి బహుమానాలు పొందుతూ దేశాటన చేస్తున్నది.

అదేవిధంగా స్వయంప్రభ వినోదంకోసం వీణావతి కచేరీ ఏర్పాటుచేశారు. వీణావతి తన వీణను శృతిచేసి మంచి జావళీ ఒకటి పాడ నారంభించింది. అది వినగానే స్వయంప్రభకు పట్టరాని ఆగ్రహంవచ్చింది. "ఏదైనా భక్తిరసప్రధానమైన పాట పాడక జావళీ పాడతావా?" అంటూ ఆమె కోపంగా లేచివచ్చి వీణావతి వీణను కాలితో బలంగా తొక్కింది. వీణ విరిగి రెండయింది.

అది ఏడుతరాలనుంచీ వాళ్ల వంశంలో ఉన్న వీణ. వీణావతికి పట్టరాని దుఃఖం వచ్చింది. "ఇటువంటి వీణ మరిదొరకదు. దీని సహాయంతో నేను ఎందరు రాజులవద్దనో బహుమానాలు పొందాను. ఇంతటితో నా గానం ముగిసింది. నేనేం తప్పుచేశాను? మీరు నా కెందుకింత అన్యాయంచేశారు?" అని వీణావతి ఏడుస్తూ ఉంటే స్వయం ప్రభకు పశ్చాత్తాపం కలిగింది.

వి. సీతారామయ్య



ఆమె తన మెడలో ఉన్న రత్నహారం తీసి వీణావతికిస్తూ, "ఈ హారంకూడా మా వంశంలో ఏడుతరాలనుంచీ ఉన్నదే, అమూల్యమైనదికూడా. అందుచేత దీనిని నీకు ఇస్తున్నాను, తీసుకుని తృప్తిపడు! ఇంతకన్న నేను నీకు చేయగల నష్ట పరిహారం ఏమీలేదు!" అన్నది.

వీణావతి రాజకుమార్తెవద్ద ఆ రత్నహారం పుచ్చుకుని, విరిగిన తన వీణతో సహా తన విడిదికి తిరిగి పోయింది. ఇక ఆ నగరంలో ఉండటానికి ఇష్టంలేక ఆమె ఆ రాత్రే బయలుదేరి మరొకదేశానికి వెళ్లిపోయింది. ఆమె దారిలో తగిలిన ప్రతి రాజధానిలోనూ ఆగి, ఆస్థానాలలో అక్కడి వీణలమీద పాట కచేరీలు చేస్తూ బహుమానాలు తీసుకుంటూవచ్చింది. కాని తన వీణమీద వాయించితే కలిగే తృప్తి ఆమెకు లేకపోయింది.

ఈ విధంగా కొన్నాళ్లు ప్రయాణంచేసి ఒకనాడు వీణావతి కాళీగుప్తమనే పట్టణం చేరింది. ఆమె సత్రంలో బసచేసి సాయంకాలంపూట చిత్రశాల చూడబోయింది. అక్కడ అనేక చిత్తరువులున్నాయి. అందులో ఒకదానిలో వీణవాయిస్తూ ఒక పురుషుడున్నాడు. ఆ పురుషుడు చాలా



అందగాడుగా ఉన్నాడు. అయినా వీణావతిని ఆకర్షించినది అతను వాయించే వీణ. అది అచ్చంగా తన విరిగిపోయిన వీణలాగే ఉన్నది.

అదిచూసి ఆశ్చర్యపడుతూ చిత్రశాలలో ఉండే భటులను, "ఈ చిత్తరువు ఎవరిది?" అని అడిగింది.

"ఇది మా రాజుగారి నాలుగవ కుమారుడైన సహదేవుడిది!" అని రాజభటులు జవాబుచెప్పారు.

ఈ సంగతి తెలియగానే వీణావతికి ఒక కోరిక కలిగింది. అదేమంటే, తన సంగీతంతో రాజకుమారుణ్ణి మెప్పించి బహు



మానంగా అతని వీణ పుచ్చుకోవాలని! ఆమె వెంటనే సహదేవుడి ఇల్లు వెతుక్కుంటూ వెళ్లి, అతని దర్శనంచేసుకుని, కచేరీ చేయటానికి అనుమతి కోరింది.

సహదేవుడు అనుమతించి, తన వీణను తెచ్చి ఆమె ముందు పెట్టించాడు. వీణను శ్రుతిచేస్తూంటే వీణావతికి ఎక్కడలేని ఆనందము కలిగింది. అది అచ్చగా తన వీణలాగే పలుకుతున్నది. ఆమె ఆ ఆనందంలో అద్భుతంగా కచేరీచేసింది.

ఆమె వాయింపు విని సహదేవుడు చాలా సంతోషించి, ఏమి బహుమానం కావాలో కోరుకోమన్నాడు. వీణావతి స్వయంప్రభ వృత్తాంతమంతా చెప్పి, తన విరిగిపోయిన వీణ చూపించి, "మీ వీణపై వాయించేదాకా నాకు చెయ్యివిరిగినట్టుగా ఉన్నది. దయచేసి తమ వీణ నాకిప్పించండి," అన్నది.

సహదేవుడు వీణావతి వీణను పరీక్షించి, "దీనిని నేను మళ్లీ అతికి నీ కివ్వగలను. నీవు విచారించ నవసరంలేదు," అన్నాడు. ఆ రాత్రల్లా అతను వీణను బాగుచేసి మర్నాడు వీణావతి వచ్చేసరికి ఆమెకు ఇచ్చేశాడు. ఎక్కడా అతుకు తెలియకుండా తన వీణను బాగుచేసిన రాజకుమారుడి ప్రజ్ఞకు మెచ్చుకుని వీణావతి రత్నహారాన్ని అతని కిచ్చేస్తూ, "దీన్ని నేను నా వీణకు ప్రతిఫలంగా స్వయంప్రభ వద్ద తీసుకున్నాను. మీరు నా వీణ నాకు దయచేయించారు గనక ఈ హారాన్ని మీరే ఉంచుకోండి!" అన్నది.

వీణావతి వెళ్ళిపోయాక సహదేవుడు స్వయంప్రభను గురించి దీర్ఘంగా ఆలోచించాడు. స్వయంప్రభ గొప్ప అందగత్తె అనీ, ఆమె మనస్సు మాత్రం వైరాగ్యంతో నిండివున్నదనీ వీణావతి అతనితో చెప్పింది. ఏవిధంగానైనా ఆ రాజకుమారి స్వయంప్రభను తన భార్యను చేసుకోవాలని సహదేవుడికి తోచింది.

ఈ లోపల ఇంద్రమిత్రుడు తన కూతురి మెడలో హారం లేకపోవటం గమనించి, జరిగిన సంగతి యావత్తూ తెలుసుకుని, చాలా కలవరపడ్డాడు. ఎందుకంటే, వారి వంశంలో ఏడు తరాలుగా ఉన్న ఆ హారం గొప్ప మహిమగలది; దానిని ఎవరు ధరిస్తారో వారు గిరిదుర్గానికి రాజౌతారు. ఈ సంగతి తెలియక స్వయంప్రభ దానిని కాస్తా వీణావతికిచ్చింది. రాజుకు మతి పోయినట్టయింది. వీణావతి ఎక్కడ వున్నా పట్టి తీసుకురావలిసిందని ఆయన తన భటులకు ఆజ్ఞాపించాడు.



రాజభటులు దారివెంబడి కనిపించిన వారిని విచారిస్తూ కొద్దిరోజులలో వీణావతిని పట్టుకోగలిగారు. ఆమె వారివెంట వచ్చి ఇంద్రమిత్ర మహారాజుతో, "మహారాజా, మీ అమ్మాయి ఇచ్చిన రత్నహారం నావద్ద లేదు. కాళీగుప్త నగరపు రాజకుమారుడు సహదేవుడు నా వీణను బాగు చేసి ఇవ్వగా, నే నాయనకు ఆ రత్నహారాన్ని బహుమతిగా ఇచ్చేశాను," అంటూ జరిగిన సంగతంతా చెప్పేసింది.

మహారాజు వీణావతిని ప్రస్తుతానికి ఖైదులో ఉంచి తన భటులను కాళీగుప్త నగరానికి పంపాడు. వారు కొద్దిరోజులలోనే తిరిగి వచ్చి, "మహారాజా, రాజకుమారుడు సహదేవుడు కాళీగుప్త నగరంలో కొన్ని రోజులుగా లేనట్టు తెలిసింది. ఆయన ఎటు వెళ్లినదీ అక్కడి వారికెవరికీ తెలియదట!" అని చెప్పారు.

పోయిన హారం తిరిగి దొరకనందున రాజుకు ఆవేదన జాస్తిఅయింది. ఇంతలో ఆయన కొక వార్త తెలిసింది. నగరం బయట రత్నగిరి అనే కొండపైన ఉండే దేవాలయంలో అద్వైత శివానందయోగి వచ్చి తపస్సు చేసుకుంటున్నాడని ఆయన విన్నాడు. ఆయన వెంటనే తన పరివారంతో బయలుదేరి ఆ యోగిని చూడబోయాడు.

ఈ యోగి ఎవరో కాదు, కాళీగుప్త నగరపు రాజకుమారుడు సహదేవుడే ఎలాగైనా స్వయంప్రభను పెళ్ళాడే ఆలోచనతో దొంగవేషం వేసుకుని వచ్చి ఆ విధంగా అక్కడ కూచున్నాడు. కాని ఈ సంగతి యెవరికీ తెలియదు.

రాజు వచ్చి నమస్కరించగానే యోగి వేషంలో ఉన్న సహదేవుడు, "రాజా, నీ వెందుకు వచ్చావో నేను దివ్యదృష్టిచేత గ్రహించాను. నీ కుమార్తె పోగొట్టుకున్న రత్నహారం నీ కుమార్తె చేతికే తిరిగి వచ్చేటట్టు మేము అనుగ్రహించాము. నీవు విచారించకు. నీ కుమార్తె వివాహం విషయం కూడా నీవు విచారిస్తున్నావు. ఆమె వివాహ ముహూర్తంకూడా ఎంతో దూరంలో లేదు. అందువల్ల నీవు ఏ విచారం లేకుండా సుఖివై ఉండవచ్చు!" అన్నాడు.

రాజుకు పెద్దబరువు దించేసినట్టయింది. "మహాత్మా, తమకు చాలా కృతజ్ఞుణ్ణి! నా కుమార్తె వివాహమాడటానికి బొత్తిగా సమ్మతించకుండా ఉన్నది. దాని మనసు మారేలాగ అనుగ్రహించండి!" అని వేడుకుని ఇంటికి తిరిగి వెళ్ళాడు.

తరవాత రాజు తన కుమార్తెను పిలిచి, "అమ్మా, రత్నగిరిపైన ఒక మహాయోగి వచ్చివున్నాడు. అయనకు గల తపశ్శక్తి



అత్యద్భుతమైనది. నేను స్వయంగా పరీక్షించాను. నువు వెళ్లి ఒక్కసారి ఆయన దర్శనం చేసిరారాదా ?" అన్నాడు.

ఈ మాట వినగానే స్వయంప్రభకు యోగిని చూడాలనీ, ఆయనవద్ద ఉపదేశం పొందాలనీ కోరిక కలిగింది. హేమ అనే చెలికత్తెను వెంటబెట్టుకుని ఆమె రత్నగిరికి వెళ్లి యోగి ముందు సాష్టాంగపడింది.

అప్పుడు సహదేవుడు ఆమెతో, "రాజకుమారీ, నీ కోరిక మాకు తెలిసింది. నీవు అజ్ఞానివై ఒక రత్నహారాన్ని ఒక గాయనికిచ్చావు. అది దొరకని కారణంచేత విచారిస్తున్నావు!" అన్నాడు.

"స్వామీ, ఆ హారంమూలాన ఆ గాయకిని మా తండ్రిగారు ఖైదులో ఉంచారు. కనీసం ఆమె విముక్తికోసమైనా ఆ హారం తిరిగి వచ్చే ఉపాయం చెప్పండి!" అన్నది స్వయంప్రభ.

సహదేవుడు కళ్ళు మూసుకుని కమండలంలో చెయ్యి పెట్టి రత్నహారం తీసి స్వయంప్రభ చేతిలో పెడుతూ, "ఇదుగో, నీ రత్నహారం! దీనిని వెంటనే తీసుకుపోయి, మీ తండ్రికి ఇచ్చి, అనవసరంగా బాధలు పడుతున్న ఆ గాయనిని చెరవిడిపించు. నీకు త్వరలోనే వివాహం కాగలదు! ఇది మా ఆశీర్వాదం!" అన్నాడు.





స్వయంప్రభ వివాహమనే మాట విన గానే కంగారుపడి, "స్వామీ, నాకు వివాహం వద్దు. జన్మతరించే ఉపాయం చెప్పండి. పెళ్ళాడమని మా నాన్నగారు నా ప్రాణం తీసేస్తున్నారు. మీరైనా తరుణోపాయం చెబుతారని ఆశపడి వచ్చాను!" అన్నది.

"నీకు వివాహం తప్పదు. కాని వైరాగ్యం చెడకుండా వివాహం జరగాలంటే అందుకు ఒకటే ఉపాయం. నన్ను పెళ్లాడు!" అన్నాడు సహదేవుడు.

ఈ మాట వినగానే స్వయంప్రభకు యోగిమీద అనుమానం తలఎత్తింది. ఆమె వినయంగా, "స్వామీ, సర్వమూ త్యజించి తపస్సు చేసుకునే తమకు వివాహ మెందుకు?" అని అడిగింది.

"పిచ్చిదానా, నిన్ను కాపాడగలందులకే వివాహమాడతాము. నీ కిష్టం లేకపోతే మానెయ్యి!" అన్నాడు సహదేవుడు.

స్వయంప్రభ చెలికత్తె అయిన హేమ, యోగి చెప్పినట్టు చెయ్యటం ఉత్తమమనీ, ఈ యోగిని పెళ్లాడకపోతే ఏ రాజకుమా రుణ్ణో పెళ్లాడి సంసారతాపత్రయంలో పడ వలిసివస్తుందనీ చెప్పింది. చివరకు స్వయం ప్రభ అద్వైతశివానందయోగిని పెళ్లాడ టానికి సమ్మతించింది. వారిద్దరికీ అప్పటి కప్పుడే వివాహమయింది. తరవాత స్వయం ప్రభ తన చెలికత్తెతోసహా ఇంటికి వెళ్లి పోయింది. తాను వచ్చినపని అయినందున సహదేవుడుకూడా తన దొంగవేషం తీసివేసి తన రాజ్యానికి తిరిగివెళ్లిపోయాడు.

రత్నగిరిపైన ఉండే దేవళం పూజారికి మాధవస్వామి అనే అల్లుడొకడున్నాడు. దేవళంలోకి ఒక యోగి రావటమూ, ఆ యోగిదగ్గిరికి మొదట రాజుగారూ, తరవాత రాజకుమార్తె వచ్చి వెళ్లటం వాడు గమ నించాడు. సహదేవుడు తన కాషాయ వస్త్రాలూ, మాయగడ్డమూ, మీసాలూ తీసి పారేసి వెళ్లిపోవటం మాధవస్వామి కంట

పడింది. శివానందయోగి అనేవాడు కపట యోగి అని వాడికి తెలిసిపోయింది.

వెంటనే మాధవస్వామి ఆ కాషాయ వస్త్రాలనూ, గడ్డాలనూ, మీసాలనూ తానే ధరించి తపస్సు చేసుకునేవాడిలాగా కూచున్నాడు. రాజుగారు మళ్ళీ వస్తాడని వాడి ఆశ. వాడు అనుకున్నట్టే జరిగింది కూడా.

యోగి ప్రభావంచేత తన కుమార్తె రత్నహారాన్ని తిరిగి తెచ్చుకున్నదని తెలియగానే రాజు వచ్చి కపట శివానందయోగి దర్శనం చేసుకుని, భక్తితో రత్నాలు పొదిగిన రుద్రాక్షమాల సమర్పించి వెళ్ళాడు. తాను మొదట చూసిన శివానందయోగి వీడు కాదని రాజు పోల్చలేకపోయాడు. మాధవస్వామికి చాలా సంతోషమయింది. ఇంకా ఇటువంటి బహుమతులు చాలా వస్తాయని వాడు ఆశపడ్డాడు. కాని ఈసారి వాడి ఆశ ఫలించలేదు.

యోగి చెప్పినట్టు రత్నహారం దొరికింది గనక స్వయంప్రభకు పెళ్ళికూడా త్వరలోనే జరుగుతుందని రాజుకు నమ్మకం కుదిరిపోయింది. అయన పెళ్ళిప్రయత్నాలు చేయసాగాడు. ఇది చూసి స్వయంప్రభ తన తండ్రితో, తనకూ శివానందయోగికీ



అదివరకే వివాహమైనట్టు చెప్పేసింది. మొదట రాజుకు చాలా ఆశాభంగం కలిగింది. చివరకు అయన తన మనసును సమాధానపరచుకుని, "ఈ సంగతి మొదటనే ఎందుకు చెప్పలేదు? మళ్ళీ మీకు వైభవంగా వివాహం చేస్తాను!" అన్నాడు.

స్వయంప్రభ వివాహానికి ఆహ్వాన పత్రికలు దేశదేశాలకూ వెళ్లాయి. రాజబంధువులు మంగళవాద్యాలతో రత్నగిరికివచ్చి కపట శివానందయోగిని రాజభవనానికి తీసుకుపోయారు. తనకు రాజకుమార్తెనిచ్చి పెళ్లిచేయబోతున్నారని తెలిసి మాధవస్వామి దిగ్భ్రమ చెందాడు.

స్వయంప్రభ తరఫున హేమ పెళ్లికొడుకును చూడవచ్చింది. వీడు అసలు శివానందయోగి కాడని ఆమె తెలుసుకుని ఈ వార్తను స్వయంప్రభకూ, ఆమె చెలికత్తెలకూ చెప్పింది. వారంతా వచ్చి మాధవస్వామిని చుట్టుముట్టి, పరాచకాలాడే నెపం మీద గడ్డాలూ, మీసాలూ పట్టిలాగి ఊడదీసారు. మోసం బయటపడింది.

రాజు ఈ వార్త విని మండిపడి కపట యోగిని పిలిపించి, "నీచుడా, ఎవరు నీవు? నిజం చెప్పు! లేకపోతే నిలువునా చీల్పిస్తాను! అసలు శివానందయోగి ఎక్కడ?" అని అడిగాడు.

"మహాప్రభూ, క్షమించండి. మీరు అసలు శివానందయోగి అనుకునేవాడు కూడా దొంగయోగే! వాడి గడ్డాలూ, మీసాలూ, బట్టలూ మాత్రమే నేనుకూడా పెట్టుకున్నాను! నన్ను వదిలెయ్యండి!" అని మాధవస్వామి చెప్పుకున్నాడు.

రాజుకు మతిపోయినట్టయింది. స్వయంప్రభను పెళ్లాడిన మాయయోగి ఎవరో తెలుసుకునే దారి కనిపించలేదు.

ఈ లోపుగా సహదేవుడికి స్వయంప్రభ పెళ్లి వార్త తెలియ వచ్చింది. శివానంద యోగినని చెప్పుకుని మరెవడో రాజపుత్రికను పెళ్లాడబోతున్నాడని ఊహించి, అతను వెంటనే బయలుదేరి గిరిదుర్గానికి వచ్చాడు. ఇంద్రమిత్రమహారాజును కలుసుకుని జరిగినదంతా చెప్పాడు. మాధవస్వామి సహదేవుణ్ణి చూసి, శివానందయోగిగా నటించిన మనిషి అతనేనని గుర్తుపట్టాడు. హేమా, స్వయంప్రభాకూడా అతనిని పోల్చగలిగారు. తనకోసం సహదేవుడు ఇంత శ్రమపడిన సంగతి తెలిసి స్వయంప్రభ అతనికి భార్య కావటానికి ఒప్పుకున్నది. తన అల్లుడు రాజకుమారుడైనందుకు రాజు సంతోషించాడు. సహదేవుడికీ, స్వయంప్రభకూ మహావైభవంగా పెళ్లి జరిగింది.





# మిత్రభేదం

వనికేగె నా నక్క - వన మృగాలన్ని
తను జూచి పారిపో-యిన కనిపెట్టి
"వినుడు మృగమ్ములు - వెఱవగా వలదు
నను మీకు రాజుగా - నంపెను బ్రహ్మ
వనరాజ్యమునకు రా-జును నాదు నాజ్ఞ
వినవలె మీరెల్ల," - నననది నక్క.
నక్కల మాత్రము - దిక్కుల కడచి
తక్కన మృగముల - తనవద్ద నిలిపె
వింత నీలిమృగమ్ము - విధి బంపె ననుచు
అంతటి మృగములే - అతనికి లొంగె
సింహాదు లా పని - చిక్కన వాని
సంహార మొనరించి - సర్వ మాంసమ్ము
తనముందు వేసిన - తను పాళ్ళువేసి
వనమృగమ్ముల కిచ్చి - తను దినుచుండె.
అట్లుండ నొక్క సా-యంతనమందు
చెట్ల క్రిందుగ మృగాల్ - చేరి కూర్చుండ
దూరాన నక్కలు - బారులు తీరి
సారెకు కూయగా - సాగె పెద్దగను.

అది వినినంతనే - ఆ నీలి నక్క
ఎద పొంగిపోయి గొం-తెత్తి గట్టిగను
కూతలు వేయగా - గొప్ప మృగాలు
ఈతగాడొక నక్క-యే లెమ్మటంచు
గబగబ మూగి ము-క్కలు జేసివైచి,
కబళించె తమకున్న - కసి యెల్ల దీఱ.
కావున పింగళ-కావనీనాథ
నీ వింక గడ్డి ది-నే దీని విడువు
మాంసము దినువారి - మమ్ము చేకొమ్ము
ధ్వంసముసేయఁ-నీతడు ఊఱకున్న.

పింగళకుడు:
ఏ కారణము జూచి - యీతనిపట్ల
నాకున్న మైత్రి వో-నాడంగవలయు

దమనకుడు:
సరి దానికేమి నా-సన్నిధియందె
పరిమార్తు మిమ్మని - పదరెను వాడు.
రేపు వచ్చినవాని - చూపులు గనుడు
మీపక్క గుఱ్ఱని - మ్రింగగా జూచు.

విద్వాన్ విశ్వం

తన తావునందు కూ-ర్చొనబోడు కనుడు."
అని చెప్పి దమనకుం - డరిగె మెల్లగను.
సంజీవకుం డింటి-చాయలనుండ
అంజలి పట్టుక - అరిగినా డంత
చాలనాళ్ళకు దర్శ-నాలు సేమమ్మె
ఈలాగు వచ్చితి-వేమనె నతడు.

దమనకుడు :

సేవకులకు నేడ - సేమమ్ము కలదు ?
ఖాపమ్ము బ్రదుకును - పరులదే కాద !
పనిసేసి ధనము సం-పాదించు నాశ
తన స్వేచ్ఛ పాలివెట్టు - జనుడు లోకమున
శునకజీవితము సే-వన మంద్రుకాని
శునకము స్వేచ్ఛగా - తను దిరుగాడు
సేవకుండెప్పుడు - స్వేచ్ఛయే లేక
ఏవారి మాటొ ఆ-లించగావలయు.

సంజీవకుడు :

అది ఏల మిత్రమా - అట్లనుచుంటి
వెదియైన చెప్పనుం-కించిన చెప్పు.

దమనకుడు :

తగదంద్రు మంత్రభే-దము పెద్దలెపుడు
తగనిదేయైనను - తప్పదు నాకు
మన మైత్రి విలువైన-దని వచ్చినాడ
తనకంటె మిత్రునే - తగు రక్ష సేయు
నా మాట విని వచ్చి-నాడవు గనుక
నీ మంచిచెడ్డల - నే చూడవలయు.
దొర నిన్ను చంప నా-తురపడుచుండె



మరియాద కాదన్న - మాటయే వినడు.
పచ్చిమాంసమ్ము సా-పడువాని కెట్లు
పచ్చిక దినువాడు - పడుననుచుండె.
వైరినెట్టైనను - వధియింపవచ్చు
ఘోరమేమని రాజు - గుజ్జినుచుండె
ఉన్న సంగతి చెప్పు-చుంటి నాపైన
నన్నంటదీ పాడు-మన్నీల నడత!
రేపటి ప్రొద్దున - ఈడు నిన్ జంపు
ఏపాప మెఱుగ న-న్నేమనుకోకు.
అని దమనకుడన్న - ఆ ఘోరవార్త
విని మూర్ఛపోయెను - వృషభేంద్రుడపుడె
పెద్దప్రొద్దునకు తె-ల్విని బొంది యతడు
తద్ద విచారించి - తా నిట్టులనియె.

సంజీవకుడు :

దొరలెప్డు విశ్వాస-దూరులే నిజము
దొర మిత్రుడనుకొంట - దోష మెల్లపుడు
సరివారితో స్నేహ-సరణి ధర్మమ్ము
దొరలతో చేరుట - దుర్నీతికాదె.
కారణమ్మొకటుండి - క్రౌర్యమ్ము దలప
ఏరీతిగానొ శాం-తింపంగవచ్చు
నిష్కారణద్వేషి - నేమి చేసినను
దుష్కరమ్మగు పగ - తొలగించుటన్న.
మృగపతి మైత్రి నీ - మెకము లెఱింగి
పగబూని చాడీలు - పలికియేయుండు.



దమనకుడు :

అటులైన దొరకు నీ - వదియిది చెప్పి
చిటికెలో మార్చుట - సేమముకాదె.

సంజీవకుడు :

కాదోయి మిత్రమా - కాదంత సులువు
ఏ దారియో చూచి - హింసింత్రు వారు.
మాయులమారులు - మంచివారలను
దాయులై ఎప్పుడో - ధ్వంసమొనర్తు.
ఒంటెను పూర్వమే-వో చేరి చెడిపి
యుంట విన్నదెకదా - ఓయి నేస్తుండ!

దమనకుడు :

ఎవ్వరా ఒంటె? వే-ధించిన దెవరు
అవ్వార్త చెప్పి న - న్నలరింపుమన్న!



# గాడిద జోస్యం

సువర్ణానదీ తీరాన ఒక గ్రామంలో ఒక జ్యోతిష్కుడుండే వాడు. ఆయన పంచాంగాలు గుణించటంలో ఆ చుట్టుపక్కల మిగిలిన సిద్ధాంతులకన్న చాలా గొప్పవాడని పేరు వచ్చింది. తరవాత జాతకాలు రాయటంలో అంతటివాడు లేడని అనసాగారు.

సిద్ధాంతిగారి ఖ్యాతి క్రమంగా రాజధానికి పాకింది. అక్కడ ఉండే రాజోద్యోగులంతా కలిసి ఆయనను రాజధానికి రప్పించారు. కొద్దికాలంలోనే సిద్ధాంతిగారికి రాజాశ్రయంకూడా దొరికింది. ఆయన చెప్పిన జోస్యానికి తిరుగు ఉండేదికాదు.

క్రమంగా సిద్ధాంతిగారు అధికారుల అనుగ్రహమూ, బోలెడంత డబ్బూ సంపాదించుకుని, నదీతీరాన తన స్వగ్రామంలో అనేక వందల ఎకరాల భూమికి హక్కుదారయినాడు. పంటలు వచ్చే తరుణంలో మాత్రం సిద్ధాంతిగారు స్వగ్రామం వెళ్ళి, చేలుకోయించి, కుప్పలువేయించి, నూర్పిళ్లు చేయించి, ధాన్యం కొట్లలో వేయించి, దాని అమ్మకానికి ఏర్పాట్లు పూర్తిచేసుకుని రాజధానికి తిరిగి పోతూండేవాడు.

ఒక ఏడాయన ఈ విధంగానే తన గ్రామం వెళ్ళాడు. కుప్పలన్నీ నూర్చి ధాన్యమంతా పొలాల్లోనే రాసి పోశారు. మధ్యాన్న భోజనం అయాక ఒక కునుకు తీసి లేచి, సిద్ధాంతిగారు చల్లగాలికి వసారాలో వచ్చి కూచున్నాడు.

ఈ సమయానికి ఊరి చాకలి ఉతికిన బట్టలు గాడిదపైన వేసుకుని ఇంటికి పోతూ, సిద్ధాంతిగారిని చూసి ఆగి, "ఏం, బాబూ ? ధాన్యమంతా పొలంలోనే ఉన్నట్టున్నది. త్వరగా ఇల్లు చేర్పించండి ! ఇంకా చూస్తారేం ?" అన్నాడు.

"చేర్పిస్తాను. ఇప్పుడేం తొందర వచ్చిందిరా ?" అన్నాడు సిద్ధాంతిగారు.

బి. ప్రభాకరరావు



"తొందర కాకేమండీ? ఇంకో గంటలో తుఫాను ముంచుకొస్తుంటేనూ?" అన్నాడు చాకలి ఆదుర్దాగా.

సిద్ధాంతిగారు నవ్వి, "నీ జోస్యం అఘోరించినట్టే ఉంది! ఈ కార్తెలో వానలే ఉండవుగదా, తుఫాను రావట మేమిటి? అదీగాక ఆకాశం చూడు, ఎంత నిర్మలంగా ఉందో! ఎక్కడా ఒక్క మబ్బు తునక లేదు. మందమారుతం వీస్తున్నది! తెలిసీ తెలియని విషయాలు పెద్దలతో ఎన్నడూ చెప్పకు!" అన్నాడు.

"మీ మంచికోరే చెబుతున్నాను. కార్తెల సంగతి నే నెరగనుగాని, ఇంకో రెండు గడియలలో తుఫాను రావటంమటుకు నిజం! వెంటనే బళ్లను పొలానికి తోలించి ఒక్క గింజ దిగబడకుండా ధాన్యమంతా ఇంటికి తెప్పించుకోండి. లేకపోతే, బంగారమంటి పంట నిష్కారణంగా పాడైపోతుంది!" అంటూ చాకలి తన గాడిదను అదిలించి ముందుకు సాగిపోయాడు.

సిద్ధాంతిగారు వాడి అమాయకత్వానికి నవ్వుకుంటూ మళ్ళీ ఒక్కసారి ఆకాశాన్ని కలయ జూశాడు. పడమటగా చిటికెన వేలంత మబ్బు ఒకటి కనిపించింది. మరి కాస్సేపటికల్లా, అడవిఏనుగుల మంద లాగా కారుమేఘాలు వాయువేగంతో అన్ని



వైపులనుంచీ వచ్చి కమ్ముకున్నాయి. సూర్యుడు ఎక్కడ ఉన్నదీ తెలియరాలేదు. ప్రపంచం చీకటిపడినట్టయి పోయింది. పెద్ద పెద్ద మానులను కూకటి వేళ్లతోసహా పెకలించగల హోరుగాలి సాగింది. ఆకాశాన ఉరుములూ, మెరుపులూ సాగి వాన ఆరంభ మయింది.

సిద్ధాంతిగారికి ఏమి చేయాలో తోచ లేదు. చాకలి చెప్పినప్పుడే ధాన్యం చేర వేసుకుంటే ఏమీ నష్టం ఉండేదికాదు. కాని పంచాంగం ప్రకారం ఈ సమయంలో వానలుండటానికి వీలులేదు గనక సిద్ధాంతి గారు చాకలి మాట లక్ష్యపెట్టలేదు.

"అన్నట్టు ఈ తుఫాను వస్తుందని చాకలికి గంటకిందటే ఎలా తెలిసింది ?" అని సిద్ధాంతిగారు ఆశ్చర్యపడ్డాడు. తుఫాను కాస్త తగ్గగానే ఆయన చాకలి ఇంటికి పరి గెత్తివెళ్లి, "ఒరే, చాకలీ ? నువు చెప్పినట్టే చిత్రంగా వాన వచ్చిందే! నీకు తప్పక జోస్యం తెలిసి ఉండాలి. ఎవరిదగ్గిర నేర్చు కున్నావురా ?" అని అడిగాడు.

"మరెవరోనా, బాబూ! నాగాడిదే నాకు జోస్యం చెబుతుంది. దాని ముందు పంచాంగాలు పనికిరావు. ఇంకో మూడు నాలుగు గడియల్లో వాన రాబోతుందనగా దాని వంటిమీద రోమాలన్నీ నిలబడతాయి. అది చెవులూ, కళ్లూ పైకెత్తి మనకు విన పడని వానకోసం ఆలకిస్తుంది. తరవాత తోకముడిచి అటూఇటూ చిందులు తొక్కు తుంది! దాని జోస్యానికి తిరుగులేదు, బాబూ !" అన్నాడు.

సిద్ధాంతి వెళ్లిపోతూ, "ఒరే, నీకు పుణ్యం ఉంటుంది. ఇవాళ జరిగిన సంగతి ఎవరికీ చెప్పకు. నా పరువు కాస్తా పోతుంది!" అని చాకలిని బతిమాలుకున్నాడు. కాని ఈ సంగతి అందరికీ తెలియనే తెలిసింది. సిద్ధాంతిగారిదగ్గిర జరగబొయ్యే విషయాలు తెలుసుకునేవారు క్రమంగా తగ్గిపోయారు.






## 8

[భువనసుందరి కారణంగా గ్రీకులు ట్రోయ్ నగరాన్ని ముట్టడించిన పదవ సంవత్సరంలో ఇరుపక్షాల గల గొప్ప యోధులు మరణించారు. గ్రీకుపక్షాన మరణించిన వారిలో వజ్రకాయుడు, భూధవుడు మొదలైనవారున్నారు; ట్రోజను ప్రముఖులలో వీరసింహుడు, మోహనుడు మొదలైనవారున్నారు. మోహనుడు పోగానే భువన సుందరిని, ఆమె కిష్టం లేకుండానే, అరిభయంకరుడు పెళ్లాడాడు. ట్రోయ్ పతనానికి పూనుకున్న రూపధరుడికి భువనసుందరి, ఆమె అత్తగారూకూడా సహకరించారు.]

ట్రోయ్‌పతనానికి కొంత ముందుగానే వర్ధనుడి కుమారుల మధ్య అంతఃకలహాలు బయలుదేరి చాలా తీవ్రంగా పరిణమించాయి.

అది చూసి వర్ధనుడు గ్రీకులతో రాజీపడటానికి రహస్యంగా ఒక యత్నంచేశాడు. అయన తన బావమరిది అయిన ప్రత్యామ్నాయుడనేవాణ్ణి రారాజు వద్దకు పంపాడు. ఈ ప్రత్యామ్నాయుడికి అరిభయంకరుడంటే ఏ మాత్రమూ పడదు. అందుచేత అతను కేవలం సంధి రాయబారాలు మాట్లాడి తిరిగిపోవటానికి బదులు రూపధరుడితో ఒక కుట్ర పన్నాడు. ట్రోయ్ రాజసింహాసనమూ, రాజధనంలో సగం వంతూ ప్రత్యామ్నాయుడికి దక్కేటట్టూ, ప్రత్యామ్నాయుడు ట్రోయ్‌నగరాన్ని రూపధరుడి చేతులలో పెట్టేటట్టూ ఒడంబడిక జరిగింది. ఈ కుట్ర కొనసాగటానికి ప్రశం




సనుడుకూడా సహాయం చెయ్యగలడని ప్రత్యామ్నాయుడు రూపధరుడితో అన్నాడు.

ట్రోయ్ నగరంలో గ్రీకులకు సహాయం చేసేవాళ్లున్నారు. ఆ నగరంనుంచి బుద్ధిమతి విగ్రహం దొంగిలించబడింది. ట్రోయ్ పతనానికి అవసరమైన పరిస్థితులన్నీ ఏర్పడ్డాయి. ఇక గ్రీకులు నగరంలోకి ప్రవేశించటమే తరవాయి. ఇందుకుగాను ఒక బ్రహ్మాండమైన కొయ్యగుర్రాన్ని తయారు చేయటానికి గ్రీకులు పూనుకున్నారు.

ఈ గుర్రాన్ని తయారుచేసినవాడు దోర్దండుడనేవాడు. ఇతను గ్రీకుల పక్షాన పోరటానికి 30 నౌకలతోసహా వచ్చాడు. ఇతను గొప్పశిల్పి, మల్లయుద్ధంలో గట్టి వాడుకూడా ; అయితే చాలా పిరికివాడు. ఇతను కొయ్యగుర్రాన్ని నిర్మించి, దానికి ఒకపక్కన, పైకి తెలియరాకుండా, తలుపు ఒకటి అమర్చాడు. రెండవ పక్కన కొయ్యలో, "తమ తిరుగుప్రయాణం సుఖంగా జరగగలందులకు బుద్ధిమతీదేవికి గ్రీకులు సమర్పించు కానుక," అని చెక్కాడు. గుర్రం కడుపులోనుంచి బయటికి ఒక తాటినిచ్చెన అమర్చాడు.

తరువాత రూపధరుడు గ్రీకువీరులలో ధైర్యవంతులందరినీ ఈ గుర్రం కడుపులో దాగటానికి ఒప్పించాడు. వీరిలో ప్రతాపుడు, రూపధరుడు, దేవమయుడు మొదలైనవారు సుమారు 30 మంది ఉన్నారు. గుర్రాన్ని నిర్మించిన దోర్దండుణ్ణికూడా ఎక్కించారు. అందరూ ఎక్కిన అనంతరం ఇతను అతి బలవంతంమీద తానుకూడా ఎక్కి, తాటినిచ్చెన లోపలికి లాగేసుకుని, తలుపుమూసి, బీగంవేసేశాడు.

మిగిలిన కార్యక్రమం రూపధరుడు వేసిన వ్యూహంప్రకారం జరిగిపోయింది.

ఆ రాత్రి చీకటిపడగానే గ్రీకులు తమ శిబిరానికి నిప్పుపెట్టేశారు. గుర్రంకడుపులో దాగిన యోధులు మినహాగా మిగిలిన గ్రీకు





లందరూ రారాజువెంట పడవలలో ఎక్కి బయలుదేరి, టెనెడోస్‌దీవికి కొంతదూరాన లంకలమధ్య లంగరు వేశారు. అయితే ఒక్క గ్రీకుమాత్రం కొయ్యగుర్రంతోబాటు ట్రోయ్‌తీరాన కావాలనే ఉండి పోయాడు. ఇలా ఉండిపోయినవాడు రూపధరుడికి దాయాది. అతనిపేరు చౌర్యనాదుడు. గ్రీకు నౌకలు తిరిగిరావలిసిన సమయం వచ్చినప్పుడు జ్యోతి వెలిగించి సంకేతం ఇవ్వటం అతని పని.

మర్నాడు తెల్లవారింది. గ్రీకుశిబిరంలో పరిస్థితులు చూడవచ్చిన ట్రోజను వేగుల వాళ్లు నగరానికి తిరిగివచ్చి, గ్రీకుశిబిర మంతా బూడిద అయిఉన్నదనీ, సముద్ర తీరాన ఒక బ్రహ్మాండమైన కొయ్యగుర్రాన్ని వదిలిపెట్టి గ్రీకులంతా వెళ్లిపోయారనీ చెప్పారు. ఈ మాట వినగానే పర్దనుడు తన కుమారులనూ, ఇతరులనూ వెంట బెట్టుకుని గుర్రాన్ని చూడవచ్చాడు.

అందరూ గుర్రంకేసి ఆశ్చర్యంగా చూస్తున్న సమయంలో ఒకరు, "ఇది బుద్ధి మతికి కానుక అయినప్పుడు మనం దీనిని నగరంలోకి తీసుకుపోయి బుద్ధిమతి ఆలయం ముందు ఎందుకు ఉంచ గూడదూ ?" అన్నారు.

మరొకరు, "ఈ యుదంలో బుద్ధిమతి మన పక్షానకన్న శత్రువులపక్షాన అధికంగా సహాయం చేసింది. మనం దీన్ని ఇప్పుడే తగలబెట్టేద్దాం. లేదా, దీన్ని విరగగొట్టి, దీని కడుపులో ఏమున్నదో చూద్దాం!" అన్నారు మరికొందరు.

ఈ మాటలకు వర్దనుడు సుతరామూ ఒప్పుకోలేదు. "దేవతకు కానుకగా వదిలిన వస్తువును నాశనంచెయ్యటం చాలా పాపం. మనం ఈ గుర్రాన్ని చక్రాలమీద నగరంలోకి చేర్చుదాం!" అన్నాడాయన.

ఆ ప్రకారమే ట్రోజనులు కొయ్యగుర్రానికి చక్రాలు అమర్చి కోటద్వారంవద్దకు



తీసుకుని వెళ్లారు. కాని అది ద్వారం పట్ట లేదు. అందుచేత ట్రోజనులు కోటగోడను ఒకచోట పగలగొట్టి విశాలమైన దారి చేసి ఆ దారిన కొయ్యగుర్రాన్ని నగరంలోకి చేర్చారు. అప్పటికీ కొయ్యగుర్రం గోడ కుండా పొయ్యేటప్పుడు నాలుగుసార్లు గోడకు రాచుకున్నది.

గుర్రం గోడ దాటి లోపలికి రాగానే, పడ గొట్టిన గోడను మళ్లీ యథాప్రకారం కట్టి. గుర్రాన్ని నగరమధ్యానికి చేర్చారు.

ఇప్పుడు గుర్రాన్ని గురించి ట్రోజను లలో మళ్లీ అభిప్రాయభేదాలూ, తగాదాలూ బయలుదేరాయి. వర్ధనుడి కుమార్తె అయిన జాలినికి దివ్యదృష్టి ఉన్నది. ఆమె గుర్రాన్నిచూసి, "ఇందులో సాయుధవీరు లున్నారు!" అని కేకపెట్టింది. ప్రత్యామ్నా యుడి కొడుకు తీక్ష్ణదృష్టి అనేవాడు ఆమెను బలపరిచాడు. "మీరు వట్టిమూఢులు! లేక పోతే గ్రీకులు దానమిచ్చినది తీసుకుం టారా?" అంటూ అతను తన శూలాన్ని గుర్రంమీదికి బలంగా విసిరాడు. అది కొయ్యగుర్రం డొక్కలో గుచ్చుకున్నది. అదే సమయానికి గుర్రంకడుపులో ఆయు ధాలు ఒకదానికొకటి కొట్టుకున్నట్టు ఖంగున చప్పుడయింది.




చుట్టూ మూగిన జనం ఒక్కసారిగా అరుస్తూ, "దాన్ని తగలబెట్టండి. ఎత్తి కోటగోడల మీదినుంచి బయటికి పారె య్యండి!" అన్నారు. వర్ధనుడి పక్షంవారు మాత్రం కొయ్యగుర్రాన్ని ఏమీ చేయవద్దని జనానికి విజ్ఞాపనలు చేసుకున్నారు.

ఈ విధంగా తర్జన భర్జనలు సాగుతున్న సమయంలో ఇద్దరు ట్రోజను సైనికులు ఒక గ్రీకును ఖైదుచేసి, సంకెళ్లు తగిలించి అక్కడికి తీసుకువచ్చారు. ఇతను చౌర్య నాథుడు. చౌర్యనాథుణ్ణి ట్రోజనులు రక రకాల ప్రశ్నలు వేశారు. రూపధరుడిదగ్గిర బాగా శిక్షణ పొందిన చౌర్యనాథుడు

ప్రోజనులకు పూర్తిగా నమ్మకం కుదిరే టట్టు, ఈ విధంగా చెప్పాడు :

"ప్రబోధుడి హత్యారహస్యం నాకు తెలుసు. తన గుట్టు నే నెరుగుదునని రూపధరుడికి నామీద గొంతువరకూ కోపం!... గ్రీకులకు యుద్ధమంటే ఏనాడో ముఖం మొత్తింది. గాలి అనుకూలించి సట్టయితే వారు చాలా కాలం క్రితమే వెళ్లిపోవలిసింది! ట్రోయ్‌ని ముట్టడించటానికి బయలుదేరి వచ్చేటప్పుడుకూడా ఇలాగే గాలి చాలా కాలం అనుకూలించకపోతే గ్రీకులు దేవతలకు బలులిచ్చి వాయుదేవుణ్ణి మంచి చేసుకున్నారు. ఈ సారి రూపధరుడు కాంశుకుణ్ణి ముందుకు లాగి, 'ఎవరిని బలి ఇవ్వాలో చెప్పు!' అన్నాడు. కాంశుకుడు పది రోజులు గడువడిగాడు. ఈ లోపల రూపధరుడు అతనికి లంచం పెట్టివుంటాడని నా నమ్మకం. పది రోజులయాక కాంశుకుడు సదస్సులోకి వచ్చి నాకేసి వేలుపెట్టి చూపాడు. నాకు సంకెళ్ళు తగిలించారు. నన్ను బలి ఇచ్చేలోగా అదృష్టవశాత్తూ గాలి అనుకూలంగా వీచింది. వెంటనే నా సంగతి మరిచిపోయి అందరూ ప్రయాణసన్నాహంలో మునిగి పోయారు. ఆ అడావుడిలో నేను తప్పించుకు పారిపోయాను."





వర్ధనుడు చౌర్యనాథుడు చెప్పిన ప్రతి మాటా నమ్మాడు. "మరి ఈ గుర్రం మాటేమిటి?" అని ఆయన అడిగాడు.

"బుద్ధిమతి మాకు అనుకూలంగా ఉండిన మాట నిజమే. కాని రూపధరుడూ, దేవమయుడూ కలిసి మీ నగరంనుంచి అ దేవివిగ్రహాన్ని ఎత్తుకుపోయాక ఆమె మాపై ఆగ్రహించింది. ఆమె విగ్రహాన్ని మా శిబిరానికి చేర్చిన వెంటనే విగ్రహంలోనుంచి మూడుసార్లు జ్వాలలు పైకి వచ్చాయి. విగ్రహం పాదాలు చెమటతో చెమ్మగిల్లాయి. దేవికి ఆగ్రహం వచ్చినట్టు స్పష్టమయింది. ఈ సారికి యుద్ధం చాలించి తిరుగుముఖం పట్టటం మంచిదనీ, బుద్ధిమతీదేవికి ఒక కానుక అర్పించి, వెంటనే బయలుదేర వలిసిందనీ, ఇంకొకసారి మంచి ముహూర్తం చూసుకుని మళ్లీ యుద్ధానికి రావచ్చుననీ కాంశుకుడు రారాజుకు సలహా ఇచ్చాడు!" అన్నాడు చౌర్యనాథుడు.

"ఇంత పెద్ద గుర్రం ఎందుకు తయారు చేశారు?" అని వర్ధనుడు అడిగాడు.

"మీరు దీన్ని నగరంలోకి తీసుకు పోకుండా చేయాలని గ్రీకుల ఉద్దేశం. ఈ గుర్రాన్ని మీరు ఉపేక్షగా వదిలివేసి నట్టయితే బుద్ధిమతీదేవి, మీపై ఆగ్రహిస్తుంది. అలాగాక, మీరు ఈ గుర్రాన్ని





శ్రమపడి నగరంలోకి తీసుకువస్తే ఇక మీకు అపజయం ఉండదు! మీ సామ్రాజ్యం నలువైపులా విస్తరిస్తుంది. అలా జరగకుండా చెయ్యాలని ఇంత పెద్ద గుర్రాన్ని తయారుచేశారు," అన్నాడు చౌర్యనాథుడు.

"పచ్చిఅబద్ధాలు! రూపధరుడి కల్పనలు! వర్ధనా, నువ్వీమాటలు నమ్మి చెడిపోకు!" అంటూ తీక్ష్ణదృష్టి అరిచాడు. అతను ఇంకా ఇలా చెప్పాడు: "నేనిప్పుడే వెళ్ళి నా ఇష్టదేవతకు బలులిచ్చి ఆరాధించి, ఈ కొయ్యగుర్రాన్ని భస్మీపటలం చేసే మార్గం తెలుసుకుంటాను!"

కాని తీక్ష్ణదృష్టి ఈ పని చేయలేకపోయాడు, ట్రోయ్‌నగరాన్ని రక్షించలేకపోయాడుకూడా. ఎందుచేతనంటే, అతను ఇంటికి వచ్చినవెంటనే ఎక్కడినుండో రెండు మహాసర్పాలు వచ్చి తీక్ష్ణదృష్టి కుమారులిద్దరినీ చుట్టి చంపేశాయి. తన పిల్లలను రక్షించబోయి తీక్ష్ణదృష్టికూడా చనిపోయాడు. కొయ్య గుర్రాన్ని నాశనం చెయ్యాలన్న అతనియత్నం భగ్నమయింది.

ఈ శకునం చూడగానే ట్రోజనులకు చౌర్యనాథుడు చెప్పిన అబద్ధాలలో పూర్తిగా గురి కుదిరింది. కొయ్యగుర్రంమీద బల్లెం విసిరిన పాపానికి బుద్ధిమతీదేవి తీక్ష్ణదృష్టిని శిక్షించిందని వర్ధనుడు తలపోశాడు. ఆయన కొయ్యగుర్రాన్ని మంత్రోక్తంగా బుద్ధిమతీదేవికి అంకితం చేయించాడు. ట్రోజను స్త్రీలు నదీతీరానికి పోయి పూలుకోసి తెచ్చి మాలలు కట్టి గుర్రంమెడమీద వేశారు, దాని నాలుగు కాళ్లచుట్టూ పూలుపరిచారు. ఇదే సమయంలో ట్రోజనులు యుద్ధంలో విజయం లభించినందుకుగాను ఉత్సవం జరపటానికి ఏర్పాట్లు ప్రారంభించారు. ప్రశంసనుడుమాత్రం కంగారుగా తన బలాలతో సహా కదిలి ఐడా పర్వతం మీదకు వెళ్లిపోయాడు.

(ముగింపు వచ్చే సంచికలో)



## తనకుమాలిన ధర్మం

ఒక చాకలివద్ద ఒక కుక్క, ఒక గాడిదా ఉండేది. గాడిద ఇంటి నుంచి రేవుకూ, రేవునుంచి ఇంటికీ బట్టలు చేరవేసేది. కుక్క బట్టలకు కాపలాకాసేది.

ఒక రాత్రి చాకలివాడి ఇంటిలో దొంగ ప్రవేశించాడు; కాని వాణ్ణి చూసి కుక్క మొరగలేదు.

"దొంగ వచ్చాడు! చూస్తావేం? గట్టిగా మొరిగి యజమానిని లేవగొట్టు!" అని కుక్కతో గాడిద అన్నది.

"నాకు కడుపునిండా ఇంత కూడు వెయ్యడు. అందుచేత నేను మొరగను," అన్నది కుక్క.

అందుచేత తానైనా యజమానిని లేపుదామనే ఉద్దేశంతో గాడిద గట్టిగా ఓండ్ర పెట్టింది. చాకలికి నిద్రాభంగమయింది. అతను లేచి బయటికి వచ్చి, నిద్రలేపిందన్న కోపంతో గాడిదను చచ్చేటట్టు కొట్టి, మళ్ళీ వెళ్ళి పడుకున్నాడు. తరవాత దొంగ బట్టలు ఎత్తుకుని తన దారిన తాను వెళ్లిపోయాడు.



# నావికుడు సింద్‌బాద్

కొంతకాలం గడిచింది. ఒక సాయంకాలం చల్లగాలి అనుభవిస్తూ ఇంటిముందు కూచుని ఆనందిస్తూండగా వీధివెంబడి కొంతమంది వర్తకులు వచ్చారు. వారిని చూడగానే దూరదేశాలనుంచి తిరిగివస్తున్నారని స్పష్టమైంది. చాలాకాలం తరవాత మాతృదేశాన్ని చూస్తున్న కారణంచేత వాళ్ళ కళ్ళలో ఆనందం తొణికిసలాడుతున్నది. ఆ ఆనందం దేశంలోనే ఉండిపోయినవాడు అనుభవించలేడు. నాకు మళ్లీ దేశాటనమీద మనసు పోయింది. నేను వెంటనే వర్తకానికి అనువైన సరుకులు విరివిగా కొని వాటితో బస్రా చేరాను. అక్కడ ఒక పెద్ద ఓడ ప్రయాణానికి సిద్ధంగా ఉంది. ఓడలో నాలాంటి వర్తకులూ, రాజప్రయాణీకులూ ఉన్నారు. నా సరుకులుకూడా ఆ ఓడలో వేయించి, అందులో ఎక్కి బయలుదేరాను.

కొత్త కొత్త విశేషాలు చూసి ఆనందిస్తూ, సరుకులు అమ్ముతూ, కొంటూ ఒక దేశంనుంచి మరొక దేశానికీ, ఒక నగరంనుంచి మరొక నగరానికీ ప్రయాణం సాగించాం. కాని ఒకరోజు మేమందరమూ ఓడపైన నిశ్చింతగా విశ్రాంతి తీసుకుంటున్న

ఆరవ సముద్రయానం

CHITRA





సమయంలో, మా సరంగు పెద్దపెట్టున ఆర్త నాదాలు చేస్తూ తన తలపాగా విసిరి కింద కొట్టి, ముఖం బాదుకోవటమూ, గడ్డం పీక్కోవటమూ చేశాడు.

మేమంతా ఆయనచుట్టూ మూగి ఏమి టేమిటని అడిగాం. "నాయనలారా, తెలుసుకోండి! మనం దారితప్పి తెలియని సముద్రంలో ప్రవేశించాం. మనని రక్షించే భారం ఇక అల్లాదే! అందరూ అల్లాను ప్రార్థించండి!" అన్నాడు సరంగు.

ఈ మాట అంటూ ఆయన, తెరచాప లను సరిచెయ్యటానికి స్తంభం ఎక్కాడు. ఇంతలోనే భయంకరమైన గాలి ఒకటి సాగింది. దాని తాకిడికి చుక్కాని తునా తునకలై పోయింది. సరంగు స్తంభం దిగి వచ్చి, "అల్లాను మించిన శక్తి లేదు! విధి బలాన్ని ఎవరూ అడ్డగించ లేరు! స్నేహి తులారా, యీ క్షణాన మన ఆటకట్టయి పోయింది!" అన్నాడు.

ప్రయాణీకులందరూ గగ్గోలుపెట్టి ఒకరి కొకరు వీడ్కోలు చెప్పసాగారు. ఇంతలోనే గాలికి ఓడ ఒక పర్వతాన్ని ఢీకొని అప్పడం నలిగినట్టు నలిగిపోయింది. ప్రయాణీకులు కొందరు నీటిలో మునిగిపోయారు. కొందరం యీదుకుంటూ, అక్కడక్కడ నీళ్లమధ్య ఉన్న రాళ్ళను చేరుకుని అప్పటికి ప్రాణాలు దక్కించుకున్నాం.

ఈ పర్వతం ఒక పెద్ద లంక అంచున ఉండి సముద్రంలోకి పొడుచుకు వచ్చింది. లంక వెంబడి తీరమంతా పగిలిపోయిన ఓడల శిథిలాలున్నాయి. వాటితాలూకు సరుకుల బేళ్లు పడిఉన్నాయి. ఆ బేళ్ళలో నుంచి ఖరీదైన సరుకులూ, నగలూకూడా బయటికి వచ్చిఉన్నాయి. వీటిమధ్య మేము తీరం చేరాం.

నేను కొంత దూరం నడిచి ఒక కొండ వాగు వద్దకు చేరాను. ఈ వాగు సము ద్రంలో పడటానికి మారుగా ఒక కొండ



పగులులోనుంచి బయలుదేరి లంకలోప లికి ప్రవహిస్తూ కొంతదూరం వెళ్ళి ఒక గుహలో దూరింది. ఈ వాగు రెండు గట్టులా కెంపులూ, ఇతర రంగుల రాళ్ళూ, వజ్రాలూ, వెండీ, బంగారు కణికలూ ఉన్నాయి. వాగులోపలకూడా గులక రాళ్లకు బదులు అమూల్యమైన రత్నా లుండి ధగధగా ప్రకాశిస్తున్నాయి. ఆ ప్రాంతాల వెదజల్లి ఉన్న సంపదను మనుష్యమాత్రు డెవడూ ఎన్నడూ కళ్ళ జూసి ఉండడు. ఆ దృశ్యం కళ్ళు మిరు మిట్లు గొలుపుతూ ఉంది. వాగువెంబడి మేలురకం ముసాంబరం చెట్లున్నాయి.

ఇవన్నీ గాక ఈ లంకలో విచిత్ర మైన ప్రవాహం ఒకటి ఉన్నది. అది నీటి ప్రవాహం కాదు. కొండలమీద ఉండే అంబరు ఎండవేడికి కరిగి నల్లని తారు లాగా అయి ప్రవాహంకట్టి సముద్రంలోకి పారుతుంది. సముద్రపు చేపలు ఈ అంబరు ద్రవాన్ని ఆత్రంగా తాగేస్తాయి. కొంత సేపయాక అది వాటి కడుపులో ఇమడక వాంతి అయిపోతుంది. అది నీటిమీద తేలి రంగు మారి, గట్టిపడి తృణమణి అయి ఒడ్డుకు కొట్టుకు వస్తుంది. అంబరుప్రవాహం మూలానా, తృణమణి మూలానా ఈ లంక అంతటా చక్కని సువాసనలున్నాయి.

ఇంత సంపదా ఇక్కడ ఉండికూడా మానవుడికి దీన్ని అనుభవించే గీత లేదు. ఎందుకంటే ఈ ప్రాంతాలకు వచ్చిన నావ భగ్నం అయితీరవలిసిందే తప్ప తిరిగి పోయే ఆశ లేదు. అందుచేత ప్రాణాలతో ఈ లంకను చేరిన మేము ఈ సంపదమధ్య దిక్కులేని దరిద్రులమై పోయాము. ఎన్నో విందులు చెయ్యటానికి సరిపడే మూల్యం ఉండికూడా మేము ఆకలికి అలమటించ వలిసి వచ్చింది. మా దగ్గిర ఉన్న కొద్ది ఆహారాన్ని ఎంతో న్యాయంగా పంచు కున్నాం. అయితే నాలాగా ఉపవాసాలకు

అలవాటు పడని నా అనుచరులు తమ ఆహారాన్ని ఒకటి రెండు పూటలలో తినేసి, కొద్ది రోజులకల్లా ఆకలికి మాడి ఒక్కొక్క రుగా చావసాగారు. నేను వాళ్లకు చేయగల సాయం ఏమీలేదు. నా వంతు ఆహారాన్ని మాత్రం పొదుపుగా కొంచెం కొంచెమే, అది కూడా రోజుకు ఒకసారే, తింటూవచ్చాను.

బతికున్నవాళ్లం చచ్చిపోయినవారిని సముద్రతీరాన ఇసకలో పాతేశాం. శవాలకు కప్పటానికి తగిన బట్టలు అక్కడ బోలె డున్నాయి. ఈ బాధలన్నిటికీ తోడు సముద్రంమీదినుంచి ఒక గాలి వీచి అంద రికీ రోగాలు తెప్పించింది. నేను తప్ప చావ కుండా మిగిలిన వారంతా ఈ రోగాలపాల పడ్డారు. చివరకు చచ్చినవాణ్ణి పూడ్చేసి, నేను ఒంటరిగా ఆ లంకలో మిగిలాను.

ఎంత పొదుపుగా తింటేనేం? నా ఆహారం కూడా అయిపోవచ్చింది. "ఇప్పుడు నేను చస్తే నా శవానికి స్నానం చేయించి పాతి పెట్టేవాళ్లు కూడా లేరే! నేనే ముందుగా ఎందుకు పోయానుగాను?" అని విచా రించాను. నాకోసం నేనొక గొయ్యికూడా తవ్వుకున్నాను. అవసానకాలం సమీపించి నప్పుడు నేనా గోతిలో పడుకుంటే వాయు దేవుడే నన్ను పూడ్చకపోతాడా అని నా



ఉద్దేశం. నా విరక్తి చెప్పటానికి లేదు. "ఒరే, సింద్‌బాద్! అయిదుసార్లు చావు తప్పి కన్ను లొట్టపోయినా నీకు జ్ఞానం రాలేదు. దాలిగుంటలో పడుకున్న కుక్క లాగా నువు మళ్లీ మొదటికి వస్తూనే ఉంటావు. ఎందుకు నీకీ ధనదాహం? నీ కున్నదంతా ఖర్చుచేస్తూ తిన్నా మూడు తరాలకు సరిపోనే!" అని నన్ను నేను తిట్టుకున్నాను.

కాని ఈ పశ్చాత్తాపం వెనకే ఒక ఆలో చన వచ్చింది. ఆ గుహలో దూరిన ప్రవాహం మాటేమిటి? అది కొండ అవతల బయటికి వచ్చి ఉండాలి. ఆ ప్రవాహం ఎక్కడికి

పోతుంది? అక్కడ ఏమున్నది? ఇక్కడ దిక్కుమాలిన చావు చచ్చేకన్న ఆ ప్రవాహం సంగతి తేల్చుకునే ప్రయత్నంలో చావటం ఎంతో మేలుకాదా?

ఈ ఆలోచనతో నాకు కాస్త ఉత్సాహం వచ్చింది. నేను ముసాంబరం కొమ్మలు కొన్ని పెద్దవిగా చూసి పోగుచేసి వాటిని కలిపి కట్టి ఒక తెప్ప తయారుచేశాను. దానిమీద పగిలిపోయిన ఓడల చెక్కలు పరిచాను. కనిపించినంతలో పెద్ద పెద్ద మణులూ, తృణమణులూ ఏరి మూటలు కట్టి తెప్పమీద ఎత్తుగా పోగుచేశాను. తరవాత నాదగ్గిర మిగిలివున్న ఆహారంతోసహా తెప్పమీద ఎక్కి, రెండు చెక్కలు తెడ్లుగా ఉపయోగిస్తూ, వేగంగా ప్రవహిస్తున్న వాగు మీద ప్రయాణమైనాను.

నా తెప్ప వాగువెంబడి పోయి పోయి, వాగుతోబాటే కొండగుహలో దూరింది. లోపల గాఢాంధకారం. వాగు ఎన్ని మెలికలు తిరిగితే తెప్పకూడా అతివేగంగా అన్ని మెలికలూ తిరుగుతూ పక్కన ఉన్న రాతికి కొట్టుకుంటున్నది. అప్పుడప్పుడూ నా తల రాతికప్పుకు కొట్టుకుంటున్నది. చూసి తప్పుకుందామా అంటే ఆ గుహ్యాంధకారంలో కన్ను పొడుచుకున్నా కనిపించటం లేదు. "ఈ అంధకారకూపంలో కెందుకు ప్రవేశించానురా, దేవుడా? ఇంతకన్న ఆ ఇసకలో చచ్చిపోయినా బాగుండేదే!" అనుకున్నాను. కాని వెనక్కు పోయే మార్గం లేదు. వాగు పల్లానికి దిగుతున్నకొద్దీ దాని దూకుడు హెచ్చుతున్నది. నేను పట్టుకున్న తెడ్లు కేవలం నిరుపయోగమయాయి. అందుచేత వాటిని వదిలేసి, తెప్పను కరుచుకుని బోర్లా పడుకున్నాను. లేకపోతే నా తల పగిలిపోయేటట్టు కనిపించింది. అట్లా పడుకున్నవాణ్ణి స్పృహ తప్పిపోయిన వాడిలాగా నిద్రపోయినాను.

(ఇంకా వుంది)





# తోడేలు దుర్బుద్ధి

కుందేలు తనకు శాస్తి చేసినప్పటినుంచీ నక్క కుమిలి పోతున్నది. కుందేలు తన పైన ఎక్కి సవారీ చేసిన కొద్ది రోజుల అవతల ఒకనాడు నక్క ఎక్కడికో పోతూ ఉండగా తోడేలు ఎదురుపడి, "ఇదేమిటి, నక్కబావా? చిక్కి సగమై పోయావే? ఒంట్లో బాగుండటంలేదా?" అని అడిగింది.

నక్క రుసరుసలాడుతూ, "ఆ కుందేలును చంపి తిన్న రోజున, నా రోగమంతా పోతుంది," అన్నది.

నక్కను కుందేలు ఏడిపించిన సంగతి అడివి అంతటా అదివరకే పాక్కిపోయింది. అయినా తోడేలు ఏమీ ఎరగనట్టుగా, "అదేమిటి? అసలు ఏం జరిగింది?" అని అడిగింది ఆశ్చర్యంనటిస్తూ.

నక్క జరిగిన సంగతంతా చెప్పింది.

అంతా విని తోడేలు, "ఈ భాగ్యానికే నువు విచారపడాలా? ఈ సాయంకాలం లోపుగా మనం ఆ కుందేలు అంతు కనుక్కుందాం!" అన్నది.

"ఎట్లా అంతు కనుక్కుందామని నీ ఉద్దేశం?" అని నక్క అడిగింది.

"మాయమాటలతో కుందేలును మీ ఇంటికి రప్పిస్తాను, సరా?" అన్నది నక్క.

"మా యింటికి రావటానికి కుందేలుకు గుండా, చెరువా? ఎన్నటికీ రాదు!" అన్నది నక్క.

"అదంతా నాకు వదిలెయ్యి. నువు ఇంటికి పోయి చచ్చిపోయినట్టుగా మంచం మీద బిర్రబిగుసుకొని కదలకుండా పడుకో. కుందేలు వచ్చి నీ వొంటిమీద చెయ్యి వేయగానే పట్టేసుకో! తెలిసిందా?" అన్నది తోడేలు.

నక్కకు ఈ మాట వినగానే పరమానందమయింది. ఇంటికి వెళ్లి, మంచంమీద బిర్ర బిగుసుకుని వెల్లికిలా పడుకున్నది.

టి. శంభుదాసు

ఈ లోపుగా తోడేలు కుందేలు ఇంటికి వెళ్ళి తలుపు తట్టింది. లోపలినుంచికుందేలు, "ఎవరు వారు ?" అని అడిగింది.

"నేను, తోడేలునులే! ఒక్క సారి తలుపు తియ్యి. నీ కొక అశుభవార్త చెప్పి పోదామని వచ్చాను," అన్నది తోడేలు.

"అశుభవార్తే? ఐతే అవశ్యం వినాలి!" అంటూ కుందేలు తలుపు తెరిచింది.

"ఇంతకు మునుపే, పాపం మన నక్క చచ్చిపోయింది. నువు వెళ్ళి ఒకసారి చూసి రా!" అన్నది తోడేలు.

"మరి ఉత్తరక్రియలు చేయించక ఇలా వచ్చావేం?" అని కుందేలు అడిగింది.

"అదుగో, ఆ పనిమీదే వెళుతున్నా!" అంటూ తోడేలు జారుకున్నది.

నక్కను చూడబోవాలా, వద్దా అని కుందేలు కాస్సేపు ఆలోచించి, "వెళ్ళి, అసలు విషయ మేమిటో తెలుసుకుందాం!" అని నిశ్చయించుకున్నది.

కుందేలు, నక్క యిండికివెళ్ళి, తలుపు నెట్టి లోపలకు తొంగి చూసింది. నక్క, తోడేలు చెప్పినట్టే, పక్కమీద వెల్లకిలా పడుకుని, బిర్రబిగుసుకుని ఉన్నది.

కుందేలు తనలోతాను మాట్లాడుకుంటు న్నట్టుగా, "పాపం, శవాన్ని చూడటానికి ఒక్కరూ వచ్చినట్టులేదే? నాకా బోలెడంత పని ఉన్నది." అన్నది. నక్కలో కొంచెం కూడా కదలికలేదు. కుందేలు మళ్ళీ ఈ విధంగా పైకి అనుకోసాగింది.

"నక్కబావ నిజంగా చావలేదేమో! ఎందుకంటే, తమను చూడవచ్చినప్పుడు చచ్చినవాళ్ళు వెనకకాలు చాచి, 'ఓహో!' అంటారుగదా! నక్క అలా అనలేదేమబ్బా? నక్క చావకపోతే నాకీ శవజాగారంకూడా దేనికి? నా దారిన నేను పోతాను!"

ఈమాట వినగానే నక్క తన వెనక కాలు పైకి చాచి, "ఓహో!" అన్నది. మరుక్షణం కుందేలు శరవేగంతో పారిపోయింది.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 జూలై సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : 'నిజము వ్యాయామంబు,

రెండవ ఫోటో : నిండు జవ్వన మిచ్చు !'

పంపినవారు : S. T. V. S. D. అయ్యంగార్, బ్రాహ్మణకోడూరు పోస్టు,

(వయా) పొన్నూరు - (గుంటూరుజిల్లా)

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# పాములు

పాములుకూడా సరీసృపాలే. ప్రపంచంలో 2 వేలకు పైబడిన రకాల పాములున్నాయి. వీటిలో కొన్ని చాలా చిన్నవి, మరికొన్ని 30, 40 అడుగులుకూడా ఉంటాయి. కాని కొన్ని లక్షణాలు అన్నిటికీ సమంగా ఉంటాయి.

ఈ లక్షణాలలో ఒకటేమిటంటే: అన్ని పాములూ పొట్టలమీద పాకుతాయి; ఏ పాముకూ కాళ్ళుండవు. వాటి అడుగుభాగాలలో ఉండే పొలుసులతో అవి నేలను పట్టుకుని కదులుతాయి. నున్నటి నేలపై వాటికి పట్టు చిక్కదు, అందుచేత అవి గరుకునేలమీద వేగంగా పరిగెత్తగలవు. కొన్నిరకాల పాములు ఈదగలవు, చెట్లు మొదలైనవి ఎక్కగలవుకూడా.

పాముల శరీరాలపైనకూడా పొలుసులుంటాయి. వాటి శరీరాలపైన రంగు రంగుల మచ్చలుండి చూడటానికి చాలా అందంగా ఉంటాయి.

వాటికి దంతాలుంటాయి, కాని వీటిని పాములు ఆహారం నమలటానికి ఉపయోగించవు. పాములు తమ ఆహారాన్ని ఉన్నపాళంగానే మింగేస్తాయి. పాముల దంతాలు లోపలివేపుకు వంగి ఉంటాయి. విషసర్పాల దంతాలు డొల్లగా ఉంటాయి, ఆ డొల్లలో విషం ఉంటుంది. అవి కాటువేసిన వారి శరీరాలలోకి ఈ విషం ఎక్కి, నాడీ మండలాన్ని నాశనం చేసి చివరకు చావు కలిగిస్తుంది.

అన్ని పాములూ విషంతో చంపవు. కొన్ని పాములు; కొండచిలువలాటివి, తమ శరీరాలను ఇతర మృగాలచుట్టూ పెనవేసి, నొక్కి చంపేస్తాయి.



పాముల ఆహారావసరాలు అతి చిత్రంగా ఉంటాయి. వాటి మూతులు చూడటానికి చిన్నవిగానే కనిపించినా, అవి తమకన్న చాలారెట్లు లావు ఉండే జంతువులను కబళించ గలవు. ఒక పాము 24 గంటల కాలంలో నాలుగు గొర్రెపిల్లలను మింగింది. ఇంకొకటి 93 పౌనుల బరువుగల మేకను గంటన్నర కాలంలో మింగింది. మరొక పాము ఒక పూట లోనే 31 పౌనుల మేకనూ, 43 పౌనుల దుప్పినీ మింగింది. సాధారణంగా ఇంత మొత్తాలలో ఆహారాన్ని మింగే పాములు విషసర్పాలు కావు.

కొన్ని పాములు ఇతర పాములను మింగుతాయి. ఒక "జూ"లో ఉండే పాము తనకన్న కొద్ది అంగుళాలు మాత్రమే చిన్నదైన పామును మింగిందట!

పాములు 18 నెలలపాటు ఆహారం లేకుండా ఉండగలవు. ఇందువల్లనే కావచ్చు, అవి గాలి తింటాయని మనవాళ్లు చెబుతారు. కాని, పాములు నీరు లేకుండా బతకలేవు.

పాములు చాలాకాలంపాటు పెరుగుతాయి. ఇందుకుగాను అవి ఏడాదికి అయిదారు సార్లు కుబుసాలను విడుస్తాయి. కుబుసం విడవటం పాముకు సులువైన పనికాదు.

ఆఫ్రికాలో ఉండే కొన్ని రకాల తాచుపాములు దూరాన ఉండే, తమ నోటినుంచి విషాన్ని ఇతర జంతువుల కళ్లలోకి గురిగా ఉమ్ముతాయి. ఈ విషం చంపదుగాని కళ్లు పోగొడుతుంది.

మానవుడు అనాదిగా పామును శత్రువుగా చూస్తూ వస్తున్నాడు. చాలా మంది కనిపించిన పామునల్లా చంపేస్తారు. కాని కొన్ని పాములు మనిషికి అపకారం చెయ్యవు, మిదుమిక్కిలి ఉపకారంకూడా చేస్తాయి. ఇవి పొలాలలో ఉండే ఎలుకలనూ, ఇతర క్షుద్రజంతువులనూ తినేస్తాయి.






ప్రొఫెసర్ పి. సి. సర్కార్

ఇది అతి సులువుగా, సరంజామా ఆటే లేకుండా, ప్రదర్శించదగిన మంచి ట్రిక్కు.




1

ఇంద్రజాలికుడు తన జేబులో నుంచి మొదటగా ఒక చిన్న గొట్టం తీసి ప్రేక్షకులకు చూపించుతాడు. ఈ గొట్టం మామూలు అగ్గిపుల్ల కంటె కాస్త పెద్దదిగా ఉంటుంది, రెండు వైపులా తెరిచి ఉంటుంది.

తరువాత ఇంద్రజాలికుడు తన జేబులోనుంచి ఒక అగ్గిపెట్టె పైకితీసి, అందులోనుంచి ఒక అగ్గిపుల్ల బయటికి తీస్తాడు. ఆ తరువాత, తాను ముందు చూపిన గొట్టాన్ని నిలువుగా పట్టుకుని, తాను తీసిన అగ్గిపుల్లను తలకిందులుగా, పైనుంచి కిందికి వచ్చేలాగు ప్రవేశపెడతాడు. (1వ చిత్రం చూడండి.) ఇంద్రజాలికుడు అగ్గిపుల్లను గొట్టంకింది చివరనుంచి బయటికి లాగినప్పుడు, ఆ అగ్గిపుల్ల తల కింది వైపుగా ఉంటుందని అందరూ అనుకుంటారు. కాని అలాకాక, అగ్గిపుల్ల తలపైనే ఉంటుంది. (2వ బొమ్మ చూడండి.)

(అందుకే ఈ ట్రిక్కుకు "తల కిందులు అగ్గిపుల్ల" ట్రిక్కని పేరు.)

ఇక, ఈ ట్రిక్కులో గల రహస్యమేమిటంటే—

ఈ ట్రిక్కులో ఉపయోగించే అగ్గిపుల్ల మామూలు అగ్గిపుల్ల కాదు. రెండు చివరలా నల్లని తల లుండేలాగు ఒక అగ్గిపుల్లను ఇంద్రజాలికుడు ముందుగానే తయారుచేసి తనవద్ద ఉంచుకుంటాడు. నేను సాధారణంగా తుమ్మబంకగాని, మైనంగాని ఉపయోగించి, దానికి రంగు వేస్తాను; మామూలు అగ్గిపుల్ల తలకు ఉండే మందులాగే కనపడేటట్టు చేస్తాను.

ఈ విధంగా రెండు తలల అగ్గిపుల్ల తయారుచేసుకున్నాక మిగిలినది చాలా తేలిక—ట్రిక్కును ఆకర్షవంతంగా, తెలివిగా ప్రదర్శించటం మాత్రమే.

ఇంద్రజాలికుడు ఈ రెండు తలల అగ్గిపుల్లను మామూలు అగ్గి పెట్టెలోనే ఉంచి, ప్రేక్షకులకు చూపటానికి తీసినప్పుడు, అగ్గిపుల్ల తలలో ఒకదాన్ని తన వేళ్లమధ్యన, కనపడకుండా పట్టుకుంటాడు. అతను దాన్ని గొట్టంలో పెట్టేటప్పుడు అది తలకిందులుగా ఉన్నట్టు కనిపిస్తుంది. మళ్లీ దాన్ని గొట్టం అడుగునుంచి పైకి లాగేటప్పుడు పుల్లతాలూకు రెండవ తల వేళ్ళ మధ్యన ఉండిపోయి, బయటికి వచ్చేటప్పుడు అగ్గిపుల్ల తలపైకి ఉన్నట్టు కనిపిస్తుంది.

యూరప్‌లో అట్టతో చేసిన అగ్గిపుల్లలు వాడతారు. అక్కడ ఈ ట్రిక్కు చేసేటప్పుడు మరొక పద్ధతి అవలంబించాలి. ఆ అగ్గిపుల్లను నిలువునా రెండుగా చీల్చి, రెండు సగాలనూ తల్లకిందులు చేసి మళ్ళీ అంటించాలి.




(3 వ చిత్రం చూడండి) ఈ పుల్లకు రెండు చివరలా తల ఉంటుందికాని, ఒక్కొక్క తలా ఒక్కొక్క వైపే కనిపిస్తుంది. అందుచేత ఇంద్రజాలికుడు గొట్టంలోనుంచి పుల్లను పైకి లాగేటప్పుడు పుల్లను తిప్పాలి.



# వార్తలు-విశేషాలు

కేంద్రం నిర్వహిస్తూవున్న ఢిల్లీ, బెనారెస్, అలిఘర్, శాంతినికేతన్ విశ్వవిద్యాలయాలలో— దక్షిణభారత భాషలలో ఏదో ఒకదానిని బోధించే యేర్పాట్లు చేయటానికి ప్రభుత్వంవారు సంప్రతింపులు జరుపుతున్నారు.

*　　　*　　　*　　　*

ఇండియన్ నేషనల్ అట్లాస్ సంస్థవారు మొట్టమొదట హిందీ అట్లాసును సిద్ధంచేస్తారనీ, దీనిలో 25 పేజీలు వుంటాయనీ విజ్ఞానపరిశోధన శాఖవారి నివేదికవల్ల తెలుస్తున్నది. ఈ అట్లాస్ 1957 సెప్టెంబరులో ప్రచురింపబడుతుంది. ఇందులో అనేక విషయాలను గురించిన వివరాలు ఉంటాయి.

*　　　*　　　*　　　*

రోమన్ చక్రవర్తి టైబీరియస్ తల్లి ఫెస్టినారాణి బొమ్మ గల బంగారు నాణాలు, ఈ మధ్య హైదరాబాదులో కొండ తవ్వుతూంటే బయటపడినాయి. ఇవి సుమారు 2000 సంవత్సరాల నాటివైనా, ఎంతమాత్రం చెక్కుచెదరలేదు. వాటిపైన గల లాటిన్ అక్షరాలు సులభంగా చదవటానికి వీలుగా ఉన్నాయి.

*　　　*　　　*　　　*

షఫీక్ స్మారకభవనం శంకుస్థాపనోత్సవానికి అధ్యక్షత వహిస్తూ, పండిత నెహ్రూ ఇలా చెప్పారు: "భాషలను నేర్చుకోడానికి సహాయపడే మెదడులోని కణాల పటుత్వం పదేళ్ళ తర్వాత తగ్గిపోతుందనీ, అందువల్ల ప్రాథమిక దశలోనే పిల్లలు ఎక్కువ భాషలు నేర్వ



గలరనీ కెనడియన్ సర్జన్ డాక్టర్ పెన్‌ఫీల్డ్ తెల్పాడు. మాటలు పలికే తీరు, వాక్య నిర్మాణ పద్ధతి, మొదలైన భాషకు సంబంధించిన ప్రాథమిక సూత్రాలను చిన్నతనంలోనే గ్రహిస్తే వయస్సు వచ్చినతర్వాత వ్యాకరణం మొదలైనవాటి అధ్యయనంలో పిల్లలు భాషాపుష్టిని చేకూర్చుకోవచ్చు."

* * * *

ఆంధ్రరాష్ట్రంలో పరిశ్రమలలోని కార్మికులకు 2·94 కోట్ల రూపాయల ఖర్చుతో 7,055 ఇళ్లను నిర్మించే కార్యక్రమాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ద్వితీయ ప్రణాళిక కాలంలో అమలు పరచబోతున్నదని సహకారశాఖా మంత్రి చెప్పారు.

* * * *

భారత విమానదళపు 24-వ వార్షికోత్సవ సందర్భంలో న్యూ ఢిల్లీలో చిత్రవిచిత్ర గతులతో విమాన విన్యాసాలు జరిగినాయి. ప్రధాని నెహ్రూ పాలం విమానాశ్రయంలో వీటిని వీక్షించి, సైనిక వందనం స్వీకరించారు. జాతీయ యువజన దళానికి చెందిన వైమానిక శాఖవారు జరిపిన విన్యాసాలపట్ల నెహ్రూ చాలా ఆసక్తి చూపారు. వీరు నడిపిన చిన్న చిన్న విమానాలలో కొన్ని, గంటకు 100-120 మైళ్ళు వెళ్లగలవట.

* * * *

హైదరాబాదు పరిసర ప్రాంతాల్లో గల స్ఫటికపు రాళ్ళు, ప్రస్తుతం బొంబాయి మొదలైన కేంద్రాలకు ఎగుమతి చేయబడుతున్నాయి. వీటి వినియోగానికిగాను గాజు ఫాక్టరీలను ప్రారంభించవచ్చుననీ; కళ్ళద్దాల ఉత్పత్తికికూడా అవకాశాలున్నవనీ గనులను పరీక్షించిన అధికారులు తెల్పుతున్నారు.

* * * *

ఏప్రిల్ 10-వ తేదీన భద్రాచలంవద్ద గోదావరి నదిలో, యాత్రికుల పడవలు రెండు మునిగిపోవటంతో ఘోరమైన ప్రమాదం జరిగింది. మునిగిపోయిన యాత్రికులు 200 కు పైగా ఉండవచ్చునని తేలింది. ఈ 12-వ తేదీన గంగానదిలోకూడ పడవప్రమాదంవల్ల 75 మంది దుర్మరణం పొందారు.



# చిత్రకథ





దాసూ, వాసూవాళ్ళ మామిడితోటలో, రోజూ ఏవరో కాయలు దొంగలిస్తున్నారు. దాసూ, వాసూలు ఆ దొంగను పట్టుకునేందుకు ప్రయత్నించారు. కాని, వాళ్ళు తోటలోకి వెళ్ళినప్పుడల్లా అక్కడ ఉన్న ఒక దిష్ఠి బొమ్మ కేకలు పెట్టి, గంతులు వేస్తూ, దాసూ, వాసూలను భయపెట్టసాగింది. ఒక రోజున 'టైగర్' తన తలకు కట్టివున్న రాక్షసుడి బొమ్మతో వెళ్ళి, దిష్ఠి బొమ్మమీదకు దూకింది. ఏదో భూతంవచ్చి మీదపడుతున్నదనుకుని దిష్టిబొమ్మ వెనక దాగివున్న దొంగ కుర్రాడు హడిలి పారిపోబోయాడు. కాని దాసూ, వాసూలు అతణ్ణి పట్టుకున్నారు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'

అరె, గెలిచిన ఆయన కనపడరేం?





ఆయన ప్యారీ మిఠాయిలు
కొనుక్కుందుకు వెళ్లేరు!

## చందాదారులకు మనవి



పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

తండ్రీ
కొడుకు
కథ

రాజ్‌కపూర్ వారి

# అబ్ దిల్లీ దూర్ నహీ






డైరెక్షన్: అమర్ కుమార్

పాటలు : శైలేంద్ర - హస్రత్ జైపురి  సంగీతం : దత్తారామ్

# చూడండి! సన్‌లైట్



## సగంబిళ్ల మాత్రమే ఈ బట్టలన్నిటిని ఉతికింది!

అట్లు చేసినట్టిది దాని అధికమైన నురగ




## సన్‌లైట్ సబ్బు

బట్టలను తెల్లగాను కాంతివంతముగాను, ఉతుకును

S. 243-50 TL

భారతదేశంలో తయారుచేయబడినది


త్వరలో
విడుదల..
శర్వాణీ వారి
అక్కచెల్లెళ్లు

Photo by Vidyavrata



బహుమతి
పొందిన వ్యాఖ్య

నిండు జవ్వన మిచ్చు!'

పంపినవారు :
S. T. V. S. D. అయ్యంగార్

